# చైతన్య భగవద్గీత

సుందర విజ్ఞాన గ్రంధాలయం

స్వామి సుందర చైతన్యా నందుల వారి గ్రంధములు
భజనలు ,వీడియోలు links అవగాహన కొరకు
మాత్రమే ఇవ్వబడినవి భక్తులు ఆశ్రమం నుండి మాత్రమే కొనుగోలు చేయ గలరని మా విన్నపము

www.sundaravignanagrandalayam.blogspot.in

# చైతన్య భగవద్గీత

## అథ అష్టమోఽ ధ్యాయః - ఎనిమిదవ అధ్యాయము

## అక్షర పరబ్రహ్మ యోగః - అక్షర పరబ్రహ్మ యోగము

***యేషాం త్వంత గతం పాపం*** - ఎవరి పాపము నశించి పోయిందో, ఎవరికి ద్వంద్వ విముక్తి జరిగిందో, వారే భగవంతుని సేవిస్తారు అని ఏడవ అధ్యాయం ఇరవై ఎనిమిదవ శ్లోకం లోను,

***ప్రయాణ కాలేఽ పి చ మాం తే విదుర్యుక్త చేతసః*** - సమాహిత చిత్తము కల వారు మరణ కాలంలో కూడా పరమేశ్వరుణ్ణే తెలుసుకుంటారు అని చివరి శ్లోకం లోను భగవంతుడు ప్రవచించిన తరువాత, సాధ్యా సాధ్యాల మధ్య అర్జునుని హృదయం ఊగిస లాడింది. ఈ విధమైన సంధిగ్దావస్థ ప్రతి సాధకునికి ఏదో ఒక సమయంలో ఏ కారణం గానో మనస్సులో చేరి కలత పెడుతుంది.

నేను భగవంతుణ్ణి తెలుసుకో గలనా? మోక్షాన్ని సాధించ గలనా? ఈ జన్మ లోనే సాధించ గలుగుతానా? నా లోని కల్మష మంతా కరిగి పోతుందా? పాపాలన్నీ ప్రక్షాళన మవుతాయా? రాగద్వేషాలు తటస్థ పడతాయా? ఒకవేళ, ఇవేవీ జరగకుండా మరణిస్తే ఏమవుతాను? ఏమీ సాధించకుండా నిష్క్రమించిన వాణ్ణి అవుతానా? అదే జరిగితే, అసలు నే నెందుకు పుట్టినట్లు? మరణ కాలంలో సమాహిత చిత్తం నాకు ఉంటుందా? బ్రతుకులో గ్రహించలేక జన్మను వృథా చేసుకున్న నేను, మరణ సమయంలో కూడా తెలుసుకోలేక పోతే, చనిపోయిన తరువాత ఏమౌతాను? మరణానంతరము నా ప్రయత్నం ఎలా ఉంటుంది? ఇలాంటి ప్రశ్నలు ఎవరికి ఎప్పుడు జనిస్తాయో చెప్పలేము గాని, ఏడవ అధ్యాయాన్ని సమాప్తం చేస్తూ శ్రీకృష్ణుడు పలికిన మాటలు అర్జునుని హృదయంలో ఈ విధమైన సందేహాలకు శ్రీకారం చుట్టాయి. ఆ ప్రశ్నలకు పరిష్కారం లభించక ముందే, తనను ఆశ్రయించి, జరామరణ మోక్షార్థం ఎవరైతే ప్రయత్నిస్తారో, వారు సమస్తాన్ని తెలుసు కుంటారు అని చెబుతూ బ్రహ్మము, అధ్యాత్మము అని, ఇంతవరకు పరిచయం కాని ఏడు సాంకేతిక పదాలను ప్రస్తావించి ఏడవ అధ్యాయాన్ని పరమేశ్వరుడు సమాప్తం చేయడం జరిగింది. పరమేశ్వరుడు ప్రస్తావించిన ఈ విషయాలే ఎనిమిదవ అధ్యాయారంభంలో పార్థుని ప్రశ్నలకు బీజా లయ్యాయి **(భగవతా అర్జునస్య ప్రశ్న బీజాని ఉపదిష్టాని)**. శ్రీకృష్ణుడు ప్రస్తావించిన ఏడు విషయాలలో తనను వేధిస్తున్న అంశము కూడా ఏడవది గానే ఉంది. నూతనంగా ప్రవేశ పెట్టబడిన ఆరు విషయాలను, తన హృదయంలో ప్రముఖంగా ఉన్నది, శ్రీకృష్ణుడు ప్రస్తావించిన విషయాలలో ఏడవది అయిన, ***ప్రయాణ కాలే చ కథం జ్ఞేయోఽ సి నియతాత్మభిః*** - మరణ సమయము నందు నియమిత చిత్తులైన వారు పరమేశ్వరుని ఎలా తెలుసు కుంటారు? అనే విషయాన్ని కలిపి మొత్తం ఏడు ప్రశ్నలను ఏక కాలంలో సంధించాడు సవ్యసాచి. అర్జునుడు ఏడు ప్రశ్నలను విడివిడిగా సంధిస్తే, పరమేశ్వరుడు వాటి నన్నిటినీ ఒకే సూత్రంలో అనుసంధానం చేసి అద్భుతంగా సమాధాన మిస్తూ ప్రవచించాడు. అదే అక్షర పరబ్రహ్మ యోగము.

ఇది ఎనిమిదవ అధ్యాయము. దీనిని అక్షర పరబ్రహ్మ యోగ మని సాధారణంగా అందరూ పిలుస్తుంటారు. ఆచార్యుల వారు దీనిని తారకబ్రహ్మ యోగము అన్నారు. ఇంకా అనేకము లైన పేర్లు అనేక వ్యాఖ్యాన గ్రంథాలలో కనిపిస్తాయి.

**అక్షరం** - క్షరము కానిది అక్షరము ***(న క్షరతీతి అక్షరం)***. అదే పరబ్రహ్మము. అక్షర పరబ్రహ్మము.

'యోగము' అంటే విచారము అని, విషయము అని, ఉపాయము అని మనం ముందే చెప్పుకొని ఉన్నాము కనుక, అక్షర స్వరూపుడైన, ఓంకార గమ్యమైన బ్రహ్మమును పొందే ఉపాయాన్ని తెలిపే విశిష్ట విషయాన్ని కలిగిన అధ్యాయము ఈ అక్షర పరబ్రహ్మ యోగము. ఇక అధ్యాయం లోకి ప్రవేశిద్దాం.

**అర్జున ఉవాచ :**

కిం తద్బ్రహ్మ కి మధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ ।
అధిభూతం చ కిం ప్రోక్త మధిదైవం కి ముచ్యతే ॥ 1
అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మి న్మధుసూదన ।
ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః ॥ 2

*కిం-తత్-బ్రహ్మ-కిం-అధ్యాత్మం-కిం-కర్మ-పురుషోత్తమ*
*అధిభూతం-చ-కిం-ప్రోక్తం-అధిదైవం-కిం-ఉచ్యతే*
*అధియజ్ఞః-కథం-కః-అత్ర-దేహే-అస్మిన్-మధుసూదన*
*ప్రయాణకాలే-చ-కథం-జ్ఞేయః-అసి-నియతాత్మభిః*

| | | | | | |
|---|---|---|---|---|---|
| పురుషోత్తమ | = | కృష్ణా! | ఉచ్యతే | = | చెప్పబడుతోంది |
| తత్ | = | ఆ | మధుసూదన | = | కృష్ణా! |
| బ్రహ్మ | = | బ్రహ్మము | అస్మిన్ | = | ఈ |
| కిం | = | ఏది? | దేహే | = | దేహము నందు |
| అధ్యాత్మం | = | అధ్యాత్మము | అధియజ్ఞః | = | అధియజ్ఞుడు |
| కిం | = | ఎట్టిది? | కః | = | ఎవ్వడు? |
| కర్మ | = | కర్మ | అత్ర | = | ఈ విషయము నందు |
| కిం | = | ఎట్టిది? | కథం | = | ఎట్లు |
| అధిభూతం | = | అధిభూతము | ప్రయాణకాలే చ | = | మరణ కాలము నందు |
| కిం | = | ఏది? | నియతాత్మభిః | = | మనస్సును నిగ్రహించిన వారి చేత |
| ప్రోక్తం | = | చెప్పబడుచున్నది | కథం | = | ఎటుల |
| అధిదైవం చ | = | అధిదైవముగ | జ్ఞేయః అసి | = | తెలియబడు తున్నావు |
| కిం | = | ఏది? | | | |

**అర్జునుడు అడుగుతున్నాడు :**

**కృష్ణా! పురుషోత్తమా! ఆ బ్రహ్మము ఏమిటి? అధ్యాత్మము ఎట్టిది? కర్మ ఏమిటి? అధిభూతము ఎటు వంటిది? అధిదైవం ఎలాంటిది? అధియజ్ఞ మనగా నేమి? మనో నిగ్రహము కలవారు మరణ కాలమున బ్రహ్మమును ఎలా తెలుసుకుంటారు?**

**వ్యాఖ్య**

ఏడవ అధ్యాయం చివర ఏ విషయాలను పరమేశ్వరుడు సూచించడం జరిగిందో, ఆ ఏడు విషయాలనే ఏడు ప్రశ్నలుగా మలచి, వాటిని వివరించ మని ఈ రెండు శ్లోకాలలో అర్జునుడు అడుగుతున్నాడు. అర్జునుడు అడిగిన ప్రశ్నల లోని అంశాలు క్రొత్తవి కాకపోయినా, అవి బహువిధ శబ్దార్థాలకు కారణం కావడం చేత, ఏ శబ్దానికి ఏది విస్పష్ట మైన అర్థమో గ్రహించాలని ఇలా అడుగుతున్నాడు.





ఆ బ్రహ్మ మేమిటి? అని ఎందుకు అడగ వలసి వచ్చింది అంటే, బ్రహ్మ శబ్దార్థం సోపాధిక బ్రహ్మమునకు, నిరుపాధిక బ్రహ్మమునకు రెండిటికీ వర్తిస్తుంది. ఈ రెండిటిలో పరమేశ్వరుడు ఏ అర్థాన్ని సూచిస్తూ ప్రవచిస్తున్నాడు? అనేది స్పష్టం కావాలి. అలాగే ఏడు విషయాలు విస్పష్టం కావలసి ఉంది.

***కిం అధ్యాత్మం?*** అధ్యాత్మ మంటే ఏమిటి? అని పార్థుడు ప్రశ్నించాడు. ***ఆత్మానమ్ అధితిష్ఠతి -*** ఇక్కడ ఆత్మ అంటే శరీరము. శరీరాన్ని అధిష్ఠించి ఉండేది అధ్యాత్మం అనే అర్థం వస్తుంది. దేహాన్ని అధిష్ఠించి ప్రత్యగాత్మ ఉంది. అలాగే ప్రాణేంద్రియాలు కూడా ఉన్నాయి. ఈ రెండిటిలో అధ్యాత్మ శబ్దార్థము దేనికి సంబంధించింది అనేది మీమాంస.

కర్మ అన్నప్పుడు అది శ్రౌతమా, స్మార్తమా, లేక లౌకికమా? సృష్టి వ్యాపారము కూడా కర్మే కదా! జీవుల వ్యవహారానికి సంబంధించి సంచిత, ఆగామి, ప్రారబ్ధాలు కూడా కర్మలే కదా! అలాగే సాత్త్వికా లైన యజ్ఞ దాన తపస్సులు కూడా కర్మలే కదా! వీటిలో పరమేశ్వరుడు దేనిని సూచిస్తున్నాడు?

అధి యజ్ఞమును గూర్చిన ప్రశ్న వచ్చినపుడు, ***విజ్ఞానం యజ్ఞం తనుతే, యజ్ఞో వై విష్ణుః -*** అనే వేద వాక్యాలలో యజ్ఞమును అధిష్ఠించి ఉండటము అనేది రెండిటికి సంబంధించి ఉండటం చేత, యజ్ఞశబ్దము విజ్ఞానాత్మను సూచిస్తూ ఉందా? లేక, విష్ణువునే చూపుతూ ఉందా? ఈ విధంగా అన్ని ప్రశ్నలు అనేక అర్థాంతో నిండి ఉన్నందున, వస్తు నిర్ధారణ సంశయ రహితంగా ఉండాలని భగవానుని ప్రశ్నిస్తున్నాడు.

*అర్జునుడు అడిగిన ఏడు ప్రశ్నలకు భగవంతుడు సమాధానం చెబుతున్నాడు.*

**శ్రీ భగవానువాచ :**

అక్షరం బ్రహ్మ పరమం స్వభా వోఽధ్యాత్మ ముచ్యతే ।
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః ॥ 3

*అక్షరం-బ్రహ్మ-పరమం-స్వభావః-అధ్యాత్మం-ఉచ్యతే*
*భూతభావోద్భవకరః-విసర్గః-కర్మసంజ్ఞితః*

| | | | | | |
|---|---|---|---|---|---|
| బ్రహ్మ | = | బ్రహ్మము | ఉచ్యతే | = | చెప్పబడుతోంది |
| పరమం | = | ఉత్కృష్ట మైనది | భూతభావోద్భవకరః | = | భూతములకు స్వభావ జననములను చేయునట్టి |
| అక్షరం | = | క్షరము కానిది | విసర్గః | = | విడుచుట |
| స్వభావః | = | స్వభావము | కర్మసంజ్ఞితః | = | కర్మ అనే పేరు గలది |
| అధ్యాత్మం | = | అధ్యాత్మము | | | |

**భగవానుడు చెబుతున్నాడు :**

**అర్జునా! బ్రహ్మము నశించనిది. అన్నిటి కన్నా గొప్పది. దాని స్వభావమే అధ్యాత్మము. భూతముల ఉత్పత్తికి కారణ మైన యజ్ఞరూప మైన త్యాగమే కర్మ**

**వ్యాఖ్య**

అర్జునుడు అడిగిన ఏడు ప్రశ్నలు ఏ వరుస క్రమంలో ఉన్నవో, అదే క్రమంలో భగవంతుడు సమాధానం చెబుతున్నాడు ***(ఏషాం ప్రశ్నానాం యథా క్రమం నిర్ణయాయ).*** మొదటి మూడు ప్రశ్నలకు మూడవ శ్లోకంలో సమాధానాలు ఉంటాయి. తరువాత మూడు ప్రశ్నలకు నాల్గవ శ్లోకం సమాధానాలు అందిస్తుంది. చివరి దైన ఏడవ ప్రశ్నకు ఐదు, ఆరు శ్లోకాలు సమాధానం చెబుతాయి. ఆ తరువాత, అధ్యాయాంతం వరకు మరణ

'యోగము' అంటే విచారము అని, విషయము అని, ఉపాయము అని మనం ముందే చెప్పుకొని ఉన్నాము కనుక, అక్షర స్వరూపుడైన, ఓంకార గమ్యమైన బ్రహ్మమును పొందే ఉపాయాన్ని తెలిపే విశిష్ట విషయాన్ని కలిగిన అధ్యాయము ఈ అక్షర పరబ్రహ్మ యోగము. ఇక అధ్యాయం లోకి ప్రవేశిద్దాం.

**అర్జున ఉవాచ :**

**కిం తద్బ్రహ్మ కి మధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ ।**
**అధిభూతం చ కిం ప్రోక్త మధిదైవం కి ముచ్యతే ॥** 1
**అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మి న్మధుసూదన ।**
**ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః ॥** 2

*కిం-తత్-బ్రహ్మ-కిం-అధ్యాత్మం-కిం-కర్మ-పురుషోత్తమ*
*అధిభూతం-చ-కిం-ప్రోక్తం-అధిదైవం-కిం-ఉచ్యతే*
*అధియజ్ఞః-కథం-కః-అత్ర-దేహే-అస్మిన్-మధుసూదన*
*ప్రయాణకాలే-చ-కథం-జ్ఞేయః-అసి-నియతాత్మభిః*

| | | | | | |
|---|---|---|---|---|---|
| పురుషోత్తమ | = | కృష్ణా! | ఉచ్యతే | = | చెప్పబడుతోంది |
| తత్ | = | ఆ | మధుసూదన | = | కృష్ణా! |
| బ్రహ్మ | = | బ్రహ్మము | అస్మిన్ | = | ఈ |
| కిం | = | ఏది? | దేహే | = | దేహము నందు |
| అధ్యాత్మం | = | అధ్యాత్మము | అధియజ్ఞః | = | అధియజ్ఞుడు |
| కిం | = | ఎట్టిది? | కః | = | ఎవ్వడు? |
| కర్మ | = | కర్మ | అత్ర | = | ఈ విషయము నందు |
| కిం | = | ఎట్టిది? | కథం | = | ఎట్లు |
| అధిభూతం | = | అధిభూతము | ప్రయాణకాలే చ | = | మరణ కాలము నందు |
| కిం | = | ఏది? | నియతాత్మభిః | = | మనస్సును నిగ్రహించిన వారి చేత |
| ప్రోక్తం | = | చెప్పబడుచున్నది | కథం | = | ఎటుల |
| అధిదైవం చ | = | అధిదైవముగ | జ్ఞేయః అసి | = | తెలియబడు తున్నావు |
| కిం | = | ఏది? | | | |

**అర్జునుడు అడుగుతున్నాడు :**

**కృష్ణా! పురుషోత్తమా! ఆ బ్రహ్మము ఏమిటి? అధ్యాత్మము ఎట్టిది? కర్మ ఏమిటి? అధిభూతము ఎటు వంటిది? అధిదైవం ఎలాంటిది? అధియజ్ఞ మనగా నేమి? మనో నిగ్రహము కలవారు మరణ కాలమున బ్రహ్మమును ఎలా తెలుసుకుంటారు?**

**వ్యాఖ్య**

ఏడవ అధ్యాయం చివర ఏ విషయాలను పరమేశ్వరుడు సూచించడం జరిగిందో, ఆ ఏడు విషయాలనే ఏడు ప్రశ్నలుగా మలచి, వాటిని వివరించ మని ఈ రెండు శ్లోకాలలో అర్జునుడు అడుగుతున్నాడు. అర్జునుడు అడిగిన ప్రశ్నల లోని అంశాలు క్రొత్తవి కాకపోయినా, అవి బహువిధ శబ్దార్థాలకు కారణం కావడం చేత, ఏ శబ్దానికి ఏది విస్పష్ట మైన అర్థమో గ్రహించాలని ఇలా అడుగుతున్నాడు.





ఆ బ్రహ్మ మేమిటి? అని ఎందుకు అడగ వలసి వచ్చింది అంటే, బ్రహ్మ శబ్దార్థం సోపాధిక బ్రహ్మమునకు, నిరుపాధిక బ్రహ్మమునకు రెండిటికీ వర్తిస్తుంది. ఈ రెండిటిలో పరమేశ్వరుడు ఏ అర్థాన్ని సూచిస్తూ ప్రవచిస్తున్నాడు? అనేది స్పష్టం కావాలి. అలాగే ఏడు విషయాలు విస్పష్టం కావలసి ఉంది.

***కిం అధ్యాత్మం?*** అధ్యాత్మ మంటే ఏమిటి? అని పార్థుడు ప్రశ్నించాడు. ***ఆత్మానమ్ అధితిష్ఠతి*** - ఇక్కడ ఆత్మ అంటే శరీరము. శరీరాన్ని అధిష్ఠించి ఉండేది అధ్యాత్మం అనే అర్థం వస్తుంది. దేహాన్ని అధిష్ఠించి ప్రత్యగాత్మ ఉంది. అలాగే ప్రాణేంద్రియాలు కూడా ఉన్నాయి. ఈ రెండిటిలో అధ్యాత్మ శబ్దార్థము దేనికి సంబంధించింది అనేది మీమాంస.

కర్మ అన్నప్పుడు అది శ్రౌతమా, స్మార్తమా, లేక లౌకికమా? సృష్టి వ్యాపారము కూడా కర్మే కదా! జీవుల వ్యవహారానికి సంబంధించి సంచిత, ఆగామి, ప్రారబ్ధాలు కూడా కర్మలే కదా! అలాగే సాత్త్వికా లైన యజ్ఞ దాన తపస్సులు కూడా కర్మలే కదా! వీటిలో పరమేశ్వరుడు దేనిని సూచిస్తున్నాడు?

అధి యజ్ఞమును గూర్చిన ప్రశ్న వచ్చినపుడు, ***విజ్ఞానం యజ్ఞం తనుతే, యజ్ఞో వై విష్ణుః*** - అనే వేద వాక్యాలలో యజ్ఞమును అధిష్ఠించి ఉండటము అనేది రెండిటికి సంబంధించి ఉండటం చేత, యజ్ఞశబ్దము విజ్ఞానాత్మను సూచిస్తూ ఉందా? లేక, విష్ణువునే చూపుతూ ఉందా? ఈ విధంగా అన్ని ప్రశ్నలు అనేక అర్థాలతో నిండి ఉన్నందున, వస్తు నిర్ధారణ సంశయ రహితంగా ఉండాలని భగవానుని ప్రశ్నిస్తున్నాడు.

*అర్జునుడు అడిగిన ఏడు ప్రశ్నలకు భగవంతుడు సమాధానం చెబుతున్నాడు.*

**శ్రీ భగవానువాచ :**

**అక్షరం బ్రహ్మ పరమం స్వభా వోఽధ్యాత్మ ముచ్యతే ।**
**భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః ॥** 3

*అక్షరం-బ్రహ్మ-పరమం-స్వభావః-అధ్యాత్మం-ఉచ్యతే*
*భూతభావోద్భవకరః-విసర్గః-కర్మసంజ్ఞితః*

| | | | | | |
|---|---|---|---|---|---|
| బ్రహ్మ | = | బ్రహ్మము | ఉచ్యతే | = | చెప్పబడుతోంది |
| పరమం | = | ఉత్కృష్ట మైనది | భూతభావోద్భవకరః | = | భూతములకు స్వభావ జననములను చేయునట్టి |
| అక్షరం | = | క్షరము కానిది | విసర్గః | = | విడుచుట |
| స్వభావః | = | స్వభావము | కర్మసంజ్ఞితః | = | కర్మ అనే పేరు గలది |
| అధ్యాత్మం | = | అధ్యాత్మము | | | |

**భగవానుడు చెబుతున్నాడు :**

**అర్జునా! బ్రహ్మము నశించనిది. అన్నిటి కన్నా గొప్పది. దాని స్వభావమే అధ్యాత్మము. భూతముల ఉత్పత్తికి కారణ మైన యజ్ఞరూప మైన త్యాగమే కర్మ**

**వ్యాఖ్య**

అర్జునుడు అడిగిన ఏడు ప్రశ్నలు ఏ వరుస క్రమంలో ఉన్నవో, అదే క్రమంలో భగవంతుడు సమాధానం చెబుతున్నాడు ***(ఏషాం ప్రశ్నానాం యథా క్రమం నిర్ణయాయ).*** మొదటి మూడు ప్రశ్నలకు మూడవ శ్లోకంలో సమాధానాలు ఉంటాయి. తరువాత మూడు ప్రశ్నలకు నాల్గవ శ్లోకం సమాధానాలు అందిస్తుంది. చివరి దైన ఏడవ ప్రశ్నకు ఐదు, ఆరు శ్లోకాలు సమాధానం చెబుతాయి. ఆ తరువాత, అధ్యాయాంతం వరకు మరణ

సంబంధమైన మీమాంసను పరిహరిస్తూ, ఏడవ ప్రశ్న యొక్క సమాధానమే సవివరంగా అసమానంగా ప్రవచింప బడుతుంది.

**(1) కిం తద్బ్రహ్మ**

బ్రహ్మ మేమిటి? అనేది మొదటి ప్రశ్న. బ్రహ్మము పరమైన అక్షరము. అక్షరము అంటే క్షరము కానిది, నశించనిది అని అర్థము ***(న క్షరతి ఇతి అక్షరమ్).*** బ్రహ్మము అక్షరము అనకుండా 'పరం' అనే విశేషణమును జోడించి పరంబ్రహ్మము అనడం జరిగింది. 'పరం' అంటే నిరతిశయ మైనది, అన్నిటి కంటే గొప్పది అని అర్థము. ఈ 'పరం' అనే విశేషణం లేకపోతే, నశించనిది బ్రహ్మము అనే అర్థం వస్తుంది. ఇలా చెబితే అతివ్యాప్తి దోషం ప్రాప్తిస్తుంది కనుక, 'పరం' అనే విశేషణం అవసర మైంది.

ఒక దాని లక్షణం మరొక దాని యందు వ్యాపించి ఉండటం అతివ్యాప్తి. పాలు అంటే ఏమిటి అని అడిగితే, తెల్లగా ఉండే ద్రవము పాలు అని అన్నా డనుకోండి, మరి సున్నపు నీళ్ళు కూడా పాల లాగే తెల్లగా ఉంటాయి కదా అనే సందేహం వస్తుంది. దీనినే అతివ్యాప్తి దోషము అంటారు. అలా గాక పాలు తెల్లగా, తియ్యగా ఉంటాయి అని గనుక అంటే, తియ్యదనం సున్నపు నీళ్ళలో ఉండదు కనుక, అతివ్యాప్తి సంభవించదు. ఇది దృష్టాంతమే.

బ్రహ్మము అక్షరము అన్నప్పుడు, అక్షరము అనే పదానికి క్షరము కానిది అని అర్థం చెప్పుకుంటే, క్షరము కానివి ఇంకా వేరేవి కూడా ఉన్నాయి. ఆకాశం క్షరము కాదు. మాయ క్షరం కాదు. ఓంకారము క్షరము కాదు. ఎందుకంటే, ఇవి కూడా అక్షర శబ్దము చేతనే చెప్ప బడ్డాయి.

ఆకాశాన్ని అక్షరం అనవచ్చు. కాని, పరమైన అక్షరము అనలేము. అన్నిటిని ఆకాశం తనలో ఇముడ్చు కుంటుంది. కాని బ్రహ్మమును ఇముడ్చుకోలేదు. కనుక, ఆకాశం పరం కాలేదు. ***తతః ఆకాశః సంభూతః*** - బ్రహ్మము నుండే ఆకాశము జనించింది. పుట్టింది. కనుక అది కార్యము. కార్యము కారణం కన్నా అన్యంగా ఉండలేదు. కాని, కార్యం లేకపోయినా, కారణం ఉంటుంది. ఆకాశము, మాయ, బ్రహ్మమును ఆశ్రయించుకొని ఉన్నాయి. కాని, బ్రహ్మము ఆకాశం కన్నా, మాయ కన్నా విలక్షణంగా ఉండటం చేత వాటిని అతిశయించి ఉంది. అదే పరమం.

***ఓమిత్యేకాక్షరం బ్రహ్మ*** - 'ఓం' అనే ఏకాక్షరము బ్రహ్మ ప్రతిపాదక మైన అక్షరము. ఇది శ్రుతి ప్రతిపాదితం. ఇదే విషయాన్ని ప్రస్తుతం మనం అధ్యయనం చేస్తున్న అధ్యాయంలో పదమూడవ శ్లోకంలో గీతాచార్యుడే చెబుతాడు. ఓంకారము అక్షరము, లేదా నశించనిది అన్నంత మాత్రాన ఓంకారము బ్రహ్మము కాదు. ఓంకారము కార్యమే కనుక, అది సాతిశయమే. ఈ కారణం చేత అది పరమం కాదు. ఓంకారము బ్రహ్మము మధ్య ఉన్నది అభిధాన అభిధేయ సంబంధమే గాని ఓంకారము బ్రహ్మ లక్షణం కాదు. కనుక, ఓంకారం అక్షరమే. కాని, పరం అనే విశేషణమును ఓంకారానికి గ్రహించడానికి వీలు లేదు ***(ఓంకారస్య పరేణ విశేషణాత్ అగ్రహణమ్).*** కనుక అక్షరమైన బ్రహ్మము అన్నిటి కన్నా గొప్పదై, నిరతిశయమై, 'పరం' అనే విశేషణము చేత చెప్ప బడింది.

**(2) కిం అధ్యాత్మం**

అధ్యాత్మ మనగా ఏమి? ఇది రెండవ ప్రశ్న. స్వభావమే అధ్యాత్మము అని చెప్ప బడింది. ఎవరి స్వభావము? పరం అయిన బ్రహ్మ స్వభావము. అక్షరమైన పరబ్రహ్మమే ప్రతి శరీరములో ప్రత్యగాత్మగా, లేదా జీవుడుగా ఉంటూ ఉంది. శరీరాన్ని అధిష్ఠించి జీవుడుగా ఉన్న పరబ్రహ్మమే అధ్యాత్మము.





విశ్వంలో ఉండి విశ్వాన్ని సూర్యుడు ఎలా ప్రకాశింప చేస్తున్నాడో, అలాగే దేహంలో ఉండి, దేహేంద్రియ ప్రాణ మనోబుద్ధులను ప్రకాశింప చేసే ప్రత్యగాత్మ అధ్యాత్మం అని చెప్ప బడింది. ప్రతి దేహము నందు పరబ్రహ్మము ప్రత్యగాత్మగా ఉండటమే స్వభావం ***(పరస్య బ్రహ్మణః ప్రతిదేహం ప్రత్యగాత్మ భావః స్వభావః).*** ఈ స్వభావమే అధ్యాత్మం అని చెప్పబడింది ***(స్వభావః అధ్యాత్మం ఉచ్యతే).*** ప్రతి దేహంలో నేను - నేను అనే భావం స్ఫురించడం కేవలం అధ్యాత్మం వల్లనే.

భగవాన్ రమణ మహర్షుల వారు ఒక అందమైన శ్లోకాన్ని అద్భుతంగా రచించారు. ఆత్మతత్త్వాన్ని ఆ శ్లోకం దివ్యంగా ప్రకాశింప చేస్తుంది.

***హృదయ కుహర మధ్యే కేవలం బ్రహ్మ మాత్రం తు***
***అహం అహం ఇతి సాక్షాదాత్మ రూపేణ భాతి ।***

హృదయ పద్మము నందు కేవలము బ్రహ్మమే 'నేను - నేను' అంటూ సాక్షాత్తు ఆత్మ స్వరూపంగా భాసిస్తూ ఉంది అన్నారు శ్లోకం పూర్వార్ధంలో. ఇక్కడ కేవలం బ్రహ్మము అంటే పరంబ్రహ్మము అని అర్థము. పరంబ్రహ్మము ఆత్మరూపేణ భాసించడమే అధ్యాత్మం. అదే బ్రహ్మ స్వభావము. అది దేహేంద్రియ ప్రాణ మనోబుద్ధులను ప్రకాశింప చేస్తూ, వాటికి అతీతంగా కూడా ఉంది అని అర్థం.

**(3) కిం కర్మ**

కర్మ అనగా నేమి? ఇది మూడవ ప్రశ్న. భూతములు ఉండటానికి పుట్టుకను కలిగించేది ***భూతభావోద్భవ కరం.*** 'భూత' అంటే చరాచరములు అని అర్థం. 'భావః' అంటే మనుగడ, లేక ఉనికి ***(భూతానాం భావః భూతభావః).*** దాని పుట్టుకకు కారణ మైనది ఉద్భవకరం ***(తస్య ఉద్భవః భూత భావోద్భవః తం కరోతి ఇతి భూత భావోద్భవ కరః).*** దీనికి హేతువైన యజ్ఞమే కర్మ అని ఈ సందర్భంలో గ్రహించాలి. అంతేగాని, సాధారణంగా మనం చెప్పుకొనే కర్మ కాదు. విసర్గ రూపమైన యజ్ఞమే కర్మ అని చెప్పబడింది. యజ్ఞాలలో అర్పించే ద్రవ్య త్యాగమే విసర్గము. యజ్ఞకర్మ వల్లనే సృష్టి కార్యం జరిగిందని మూడవ అధ్యాయం లోనే విస్తరించి చెప్పు కున్నాం కదా! సృష్ట్యాది యందు ఏది త్యాగమయ యజ్ఞరూపంలో ఉండిందో అదే కర్మ అని చెప్ప బడింది.

అర్జునుడు అడిగిన ఏడు ప్రశ్నలలో మూడు ప్రశ్నలకు ఈ శ్లోకంలో సమాధానాలు అందాయి. బ్రహ్మము, అధ్యాత్మము రెండూ ఒక్కటే అనేది మనకు అర్థమైంది. యజ్ఞ రూప కర్మ ద్వారా ఏర్పడిన సృష్టికార్యంలో విస్తరించి ఉన్నది కూడా బ్రహ్మమే కదా! ***ఏతస్య అక్షరస్య ప్రశాసనే గార్గి*** - ఓ గార్గీ! అక్షర స్వరూపమైన బ్రహ్మ శాసనం ప్రకారమే సర్వ ప్రపంచము నడుస్తూ ఉందని బృహదారణ్యక శ్రుతి. కనుక బ్రహ్మ, జీవ, జగత్తులకు అఖండత్వము ప్రాప్తించినట్లే అయింది.

*తరువాత మూడు ప్రశ్నలకు సమాధానం చెబుతున్నాడు.*

**అధిభూతం క్షరో భావః పురుష శ్చాధిదైవతమ్ ।** 4
**అధియ జ్ఞోఽ హ మేవాత్ర దేహే దేహభృతాం వర ॥**

***అధిభూతం-క్షరః-భావః-పురుషః-చ-అధిదైవతం***
***అధియజ్ఞః-అహం-ఏవ-అత్ర-దేహే-దేహభృతాం-వర***

| | | | | | |
|---|---|---|---|---|---|
| దేహభృతాంవర | = | పురుషశ్రేష్ఠా! అర్జునా! | భావః | = | భావము గలది |
| అధిభూతం | = | అధిభూతము | పురుషః చ | = | పురుషుడు |
| క్షరః | = | నశించునట్టి | అధిదైవతం | = | అధిదైవతము |

| | | |
|---|---|---|
| అత్ర | = | ఈ |
| దేహే | = | దేహము నందు |
| అధియజ్ఞః | = | అధియజ్ఞుడు |
| అహం ఏవ | = | నేనే |

**నరశ్రేష్ఠా! అర్జునా! నశించేది అధిభూతము. పురుషుడు అధిదైవతము. దేహంలో నేనే అధియజ్ఞము.**

**వ్యాఖ్య**

**(4) కిం అధి భూతం**

అధిభూతము ఏమిటి? అనేది నాల్గవ ప్రశ్న. ***అధిభూతం క్షరో భావః*** - నశించే స్వభావం గల వస్తువు అధిభూతం అని సమాధానము. క్షరము అంటే నశించేది. ***భావః*** అంటే పుట్టుక. ***క్షరో భావః*** అంటే నశించే స్వభావము గల వస్తువు యొక్క పుట్టుక అని అర్థం. కనుక పుట్టి నశించే ప్రతి వస్తువు అధిభూతమే. అన్ని దేహాలూ అధిభూతాలే. అంతే కాదు, దేహాల ఉనికికి ఆధారాలుగా ఉన్న శీతోష్ణాదులు కూడా అధిభూతం క్రిందికే వస్తాయి. వాటికి కూడా ఉత్పత్తి వినాశా లున్నాయి. శీతోష్ణాలు పుడుతాయి. అలాగే లేకుండా పోతాయి. అందుచేత అవి కూడా అధిభూతాలే.

అధిభూతాలు క్షరోభావాలు. క్షరోభావ మంటే నశించిన తరువాత తిరిగి పుట్టేవి. పుట్టి నశించేవి అనకుండా, చచ్చి పుట్టేవి అని ఎందుకు అన్నట్లు? పుట్టేవి ఏవో, ఎక్కడ నుండి పుడుతాయో మనకు తెలియదు. అలాగే చచ్చేవి ఎక్కడికి పోతాయో కూడా తెలియదు. ఉన్నవే మనకు తెలుస్తూ ఉన్నాయి. ***భావః*** అంటే ఉండటము, లేదా ఉనికి. ఉన్నవే పోతూ ఉన్నాయి కనుక, తెలిసిన దాని నుండే తెలియని దానిని తెలుసుకోవాలి అనే శాస్త్రీయ అవగాహనకు ఈ క్షరోభావ ప్రయోగము అర్థం పడుతోంది.

'ఏది అక్షరమో అది బ్రహ్మము' అని మొదటి ప్రశ్నకు ఏదైతే సమాధానమో దానికి భిన్నంగా 'ఏది క్షరమో అది అధిభూతము' అని నాల్గవ ప్రశ్నకు సమాధానంలో తెలుసుకుంటున్నాం. ఏడవ అధ్యాయంలో పరాపర ప్రకృతులను గూర్చి తెలుసుకున్నాము *(7 - 5 & 6)*. దేనిని పరాప్రకృతిగా అక్కడ గ్రహించామో అదే ఇక్కడ అధ్యాత్మము. దేనిని అపరా ప్రకృతిగా అక్కడ తెలుసు కున్నామో, అదే ప్రస్తుతం అధిభూతంగా తెలుస్తూ ఉంది.

**(5) కిం అధిదైవం**

ఈ సమస్త జగత్తు పురుషుడే అధిదైవము ***(పురుషః అధిదైవమ్)*** అనేది ఐదవ ప్రశ్నకు సమాధానము. ***పూర్ణం అనేన సర్వం ఇతి పురుషః*** - ఎవని చేత సర్వము నిండి ఉన్నదో అతడే పురుషుడు అని ఒక అర్థము. ***పురి శయనాత్ వా పురుషః*** - పురము అనబడే శరీరములో ఉన్నవాడు పురుషుడు అని మరొక అర్థము. అనే అధిభూతం దేని కారణంగా నిలబడి ఉందో అది అధిదైవము. పురుషుడే అధిదైవము.

బాహ్యంలో భూత ప్రపంచాన్ని స్థావర జంగమాత్మకంగా మనం చూస్తున్నాము. అంటే కొన్ని కదిలేవి. కొన్ని కదలనివి. రెండూ పుట్టినవే కనుక అవి అధిభూతమే

కాని, కదలని వాటిని గూర్చి మనం ఆలోచించడం లేదు. ఆందోళన చెందడం లేదు. ఈ భూమి రేపు నన్ను ఏం చేస్తుందో అని మనం ఆలోచించటం లేదు. ఈ మనిషి ఏం చేస్తాడో, ఆ పాము ఎక్కడుందో! అని ఆలోచిస్తున్నాం.

ఒక వ్యక్తి పిస్తోలు పట్టుకొని మనల్ని చంప డానికి ముందుకు వస్తూ ఉంటే, మనం ఎంతగానో చలించి పోతాం. అలా వస్తూ ఉన్నవాడు హఠాత్తుగా గుండెపోటుకు గురై క్రిందపడి అక్కడికక్కడే మరణించా డనుకోండి.





ఇప్పుడు ఆ చచ్చిన వ్యక్తి మనకు భయహేతువు అవుతాడా? చంపాలని వచ్చిన దేహం అక్కడే ఉంది కదా! పైగా పిస్తోలు కూడా చేతి లోనే ఉంది. అయినా, మనకు భయం కలగడం లేదు. అధిభూతం అక్కడే ఉంది. అధిదైవం లేకపోవడం చేత మనం నిర్భయంగా ఉన్నాం.

దేహం అధిభూతం. దేహంలో ఇంద్రియ ప్రాణ మనోబుద్ధుల చలనానికి ఆధారమై దేహంలో పూరింప బడియున్న పురుషుడే అధిదైవతము. అతడే సూక్ష్మ శరీరాభిమాని. మరి, సమిష్టి సూక్ష్మ శరీరాభిమాని ఎవరు? అతడే హిరణ్యగర్భుడు. సూర్యమండ లాంతర్వర్తి. సూక్ష్మ శరీరాలను ప్రకాశింప చేసే లింగాత్మ పురుషుడు ***(పురుషః ఆదిత్యాన్తర్గతః హిరణ్య గర్భః సర్వప్రాణి కరణానాం అనుగ్రాహకః సః అధి దైవతమ్).*** ప్రాణులలో ఇంద్రియ ప్రాణ మనోబుద్ధు లనే సూక్ష్మ శరీరము చరించుటకు కారణమైన పురుషుడే, సమిష్టి దేహాల లోని సూక్ష్మ దేహాలు చరించుటకు కారణమై ఆదిత్య మండలములో హిరణ్యగర్భుడుగా ప్రకాశిస్తున్నాడు. అతడే అధి దైవతం.

***య ఏతన్మండలం తపతి యశ్చాస్మిన్నణ్డలే పురుషః*** - ఎవడు సూర్యమండలమును తపింప చేస్తూ సూర్యుని లోనే ఉన్నాడో, అతడే దేహాన్ని ప్రకాశింప చేస్తూ దేహము నందే ఉన్నాడు అని వేదము. అతడే పురుషుడు. అధిదైవతము.

**(6) అధియజ్ఞః కః**

అధియజ్ఞు డెవరు? అనేది ఆరవ ప్రశ్న. దేహము నందు అధియజ్ఞము తానే. యజ్ఞాభిమాని అయిన విష్ణువే అధియజ్ఞము. ***యజ్ఞోవై విష్ణుః*** అనే వేద వచనానుసారం సర్వ యజ్ఞాభిమాని అగు విష్ణువను దేవతయే అధియజ్ఞుడు.

ఉదాహరణకి, ఆహారాన్ని మనం స్వీకరిస్తాము కదా! వైశ్వానర రూపంలో చతుర్విధ మైన ఆహారాన్ని స్వీకరించే భోక్త అధియజ్ఞుడు. ఈ విధమైన యజ్ఞకర్మ దేహం లోనే జరుగుతూ ఉంది కనుక అధియజ్ఞ దైన విష్ణువు దేహము నందే ఉన్నాడు. దేహం దీనికి ఆధారం. అందుచేత, **దేహే** - ఈ దేహములో అని చెప్ప బడింది.

అధిభూతము, అధిదైవము, అధియజ్ఞము - ఈ మూడు కూడా బ్రహ్మము కన్నా అన్యం కాదని అర్థమైంది. బ్రహ్మ, అధ్యాత్మ, కర్మములకు మూడవ శ్లోకంలో అఖండత్వము ప్రాప్తించినట్లే, అధిభూత, అధిదైవ, అధియజ్ఞాలకు ప్రస్తుత శ్లోకంలో అఖండత్వం ప్రాప్తించింది. ఇక అర్జునుడు అడిగిన ఏడవ ప్రశ్నకు సమాధానం అందవలసి ఉంది.

చెబుతున్నాడు.

**అన్తకాలే చ మామేవ స్మర న్ముక్త్వా కలేబరమ్ ।** 5
**యః ప్రయాతి స మద్భావం యాతి నా స్త్యత్ర సంశయః ॥**

***అంతకాలే-చ-మాం-ఏవ-స్మరన్-ముక్త్వా-కలేబరమ్***
***యః-ప్రయాతి-సః-మద్భావం-యాతి-న-అస్తి-అత్ర-సంశయః***

| | | |
|---|---|---|
| యః | = | ఎవడు |
| అంతకాలే చ | = | మరణ సమయాన |
| మాం ఏవ | = | నన్నే |
| స్మరన్ | = | స్మరిస్తూ |
| కలేబరం | = | దేహమును |
| ముక్త్వా | = | విడిచి |
| ప్రయాతి | = | వెళ్తున్నాడో |
| సః | = | వాడు |

| | | | | | |
|---|---|---|---|---|---|
| మద్భావం | = | నా భావమును | సంశయః | = | సందేహము |
| యాతి | = | పొందుతున్నాడు | న అస్తి | = | లేదు |
| అత్ర | = | ఆ విషయములో | | | |

**పార్థా! మరణకాలంలో కూడా ఎవరైతే నన్నే స్మరిస్తూ దేహాన్ని విడిచిపెట్టి వెళ్తున్నాడో, వాడు నా స్వరూపాన్నే పొందుతాడు. ఈ విషయంలో సందేహం అవసరం లేదు.**

**వ్యాఖ్య**

**మరణ కాలంలో మద్భావం**

***ప్రయాణ కాలే చ కథం జ్ఞేయోఽసి*** - మరణకాలం లోను పరమేశ్వరుని ఎలా తెలుసుకుంటారు? అనేది ఏడవ ప్రశ్న. దానికి సమాధానం ఐదు, ఆరు శ్లోకాలలో భగవంతుడు చెబుతున్నాడు.

అర్జునా! మరణ కాలంలో కూడా నన్నే స్మరిస్తూ దేహాన్ని త్యజించి వెళ్ళిన వాడు నా స్వరూపాన్నే పొందుతాడు. ఇందులో సందేహం అవసరం లేదు అంటున్నాడు అచ్యుతుడు.

మనస్సును నియమించిన వాళ్ళు ప్రయాణ కాలం లోను నిన్నెలా తెలుసుకొని ఉపాసిస్తారు? అనేది అర్జునుని ప్రశ్న. ప్రయాణ కాలము అంటే, ఉన్న చోటును విడిచి పయన మయ్యే కాలము. దేహంలో ఉన్న జీవుడు దేహాన్ని త్యజించి వెళ్ళిపోయే కాలము అని అర్థము. అదే మరణ కాలము. దేహభంగ కాలము. ప్రయాణ కాలము.

***ప్రయాణ కాలే చ*** అన్నాడు అర్జునుడు. ***అన్త కాలే చ*** అంటున్నాడు గీతాచార్యుడు. ఇద్దరి వాక్యాలలో **చ** కార ప్రయోగ ముంది. **చ** అంటే కూడా అని అర్థము. మరణ కాలంలో కూడా ఎలా స్మరిస్తారు? అనే అర్జునుడి ప్రశ్నకు, మరణ కాలంలో కూడా నన్నే స్మరిస్తూ దేహ త్యాగం చేస్తేనే నా భావాన్ని పొందడం జరుగుతుంది అనేది పరమాత్మ సమాధానం. అంటే, జీవిత కాలంలో స్మరించడం సంభవం. కాని, కఫ వాత పిత్తాలు పీడిస్తున్న భయంకర మరణ వేళ కూడా స్మరించడం ఎలా సాధ్యం? అనేది అర్జునుని ఆంతర్యం. జీవిత కాల మంతా స్మరించాడు కనుకనే, మరణ సమయంలో కూడా స్మరిస్తాడు అనేది భగవంతుని జ్ఞానము.

ఈ అనంత జీవయాత్రలో, అనేక జన్మలలో అలసి పోతున్న జీవుడు మధ్య మధ్యలో తీసుకొనే విరామమే మృత్యువు. నిద్ర చిన్న మృత్యు వైతే, మృత్యువు దీర్ఘ నిద్ర. సాగేది ఏదైనా ఆగేందుకే. కాలంలో ప్రయాణం సాగుతుంది. సాగే ప్రయాణం ఎక్కడ ఆగుతుందో అదే ప్రయాణంలో అంత్యకాలం.

ఇంతకీ ఏది అంత్యకాలం? వాస్తవం చెప్పాలంటే ప్రతిక్షణమూ అంత్యకాలమే. మన వ్యవహారాలతో సంబంధం లేకుండా కాలం పయనిస్తూనే ఉంటుంది. కాలశకటం ఎవరి కొరకూ ఆగదు.

కాలంలో కళ్ళు తెరచి కాళ్ళు చేతులు కదిలించాం. కాలం లోనే ఆడుకున్నాం. చదువుకున్నాం. ధనార్జన చేశాం. సంసారం తయారు చేసుకున్నాం. వినోదాలు విలాసాలు ఒక వైపు, విలాపాలు విషాదాలు మరో వైపు బ్రతుకును కదుపుతూ, కుదుపుతూ ఉంటే, మన వ్యవహారాలతో సంబంధం లేకుండా కాలం పయనిస్తూనే ఉంది. జీవితం ఎంత కాలం పయనించినా, ఆగేది ఒక్క క్షణం లోనే. అదే అంత్యక్షణం. ఆ తరువాత? ఏముంది? నిద్రించిన వాడు మేల్కొనిన తరువాత వ్యవహారాన్ని కొనసాగించినట్లు, మరణించిన జీవి మృత్యు నిద్ర నుండి మేల్కొని క్రొత్త బ్రతుకును కొనసాగిస్తాడు.





**మరణం - స్మరణం**

మరణ కాలంలో ఎవరైనా చేసేది దేహత్యాగమే. జ్ఞాని అయినా, అజ్ఞాని అయినా మరణంలో దేహాన్ని త్యజించక తప్పదు. దేహాన్ని త్యజించిన అజ్ఞాని తిరిగి వేరొక దేహాన్ని పొందుతాడు. దేహాన్ని త్యజించిన జ్ఞాని తిరిగి దేహాన్ని పొందడు. పరమాత్మను పొందుతాడు. అజ్ఞానం ఉండటం చేత దేహాన్ని త్యజించిన అజ్ఞాని తిరిగి దేహంతో జన్మిస్తాడు. అజ్ఞాననాశము జరిగింది కనుక జ్ఞాని తిరిగి జన్మించడు.

మరణ కాలంలో స్మరించి నంత మాత్రాన పరమాత్మను పొందడం సాధ్య పడుతుందా? అనేది శంక. ఇక్కడ స్మరించడ మనేది ప్రధానమా? లేక మరణ కాలంలో స్మరించడ మనేది ప్రధానమా? స్మరించడ మనేదే ప్రధానము. అదే వాస్తవ మైతే, జీవిత కాలంలో ఎన్ని సార్లు మనం భగవంతుని స్మరించ లేదు? అప్పుడు ప్రాప్తించని పరమాత్మ స్వరూపం మరణ కాలంలో ప్రాప్తిస్తుందా?

కాబట్టి, ఇక్కడ స్మరించడము అంటే తెలుసుకోవడము లేక జ్ఞానము అని అర్థము. జీవిత కాలంలో స్మరించిన వాడు మరణ కాలంలో పరమాత్మ స్మృతికి రాక స్మరించలేక పోవచ్చు. కాని, పరమాత్మ జ్ఞానం అలాంటిది కాదు. అది వస్తు తంత్రము. కనుక నిత్య జ్ఞానమై ఉంటుంది.

జీవించి ఉన్నప్పుడే తాను బ్రహ్మము అనే ఎరుక కలిగిన జ్ఞాని, మరణ కాలంలో కూడా **(అంత కాలేచ దేహభంగ కాలే)** తాను బ్రహ్మమే అనే జ్ఞానంతో ఉంటాడు. అలాంటి వాడు పొందే దేముంటుంది? పొందక పోతే కదా ప్రత్యేకంగా పొందాలి!

జ్ఞానం లేని వాడు మరణిస్తే, స్థూలదేహాన్ని విడిచి పెట్టి, సూక్ష్మ దేహంతో పయనించి మరొక దేహాన్ని ధరిస్తాడు. అజ్ఞానం ఉన్నంత వరకు సూక్ష్మ శరీరం అనేక స్థూల దేహాలతో సంయోగ వియోగాలను సాగిస్తూనే ఉంటుంది గాని నశించదు.

జ్ఞాని విషయం వేరు. అతడు బ్రహ్మమును తెలుసుకున్న వాడు. తానే బ్రహ్మము అనే బ్రహ్మాత్మ జ్ఞానము కలవాడు. మరణ కాలంలో స్థూల దేహంతో పాటు సూక్ష్మ దేహం కూడా నశిస్తుంది కనుక, మరణానంతరం జ్ఞాని ఎక్కడికి పయనించాలి? తాను లేని చోటంటూ ఉంటే కదా పయనించడానికి? ఇక్కడ జ్ఞాని పరమాత్మ స్వరూపాన్నే పొందుతాడు అంటే, పరమాత్మ కన్నా తాను వేరుగా లేడు అనే జ్ఞానంతో ఉంటాడని అర్థము. దేహం ఉన్నా, ఊడినా జ్ఞాని జ్ఞానంలో మార్పు ఉండదు.

***న తస్య ప్రాణా ఉత్క్రామన్తి అత్రైవ సమవలీయన్తే*** - జ్ఞానికి ప్రాణోత్క్రమణమే లేనందున, అతడు పోవడము అనేది ఉండదు అన్నది వేదం.

**(అత్ర అస్మిన్ అర్థే, సంశయః యాతి వా న వా ఇతి, నాస్తి న విద్యతే).**

మరణ కాలంలో ఏ భావం ఉంటే, దానినే పొందడం జరుగుతుంది అనేది తన విషయం లోనే గాక అన్యుల విషయంలో కూడా వర్తిస్తుంది అంటున్నాడు వాసుదేవుడు.

**యం యం వాపి స్మర న్భావం త్యజ త్యన్తే కలేబరమ్ ।** 6
**తం త మే వైతి కౌన్తేయ సదా తద్భావ భావితః ॥**

***యం-యం-వా-అపి-స్మరన్-భావం-త్యజతి-అంతే-కలేబరమ్***
***తం-తం-ఏవ-ఏతి-కౌంతేయ-సదా-తద్భావభావితః***

| | | | |
|---|---|---|---|
| కౌంతేయ | = అర్జునా! | సః | = వాడు |
| యః | = ఎవడు | సదా | = ఎల్లప్పుడు |
| అంతే | = అంతమున | తత్ | = ఆ |
| యం యం భావం వా అపి | = ఏయే భావమును | భావభావితః | = భావమునే తలుస్తూ |
| స్మరన్ | = తలుస్తూ | తం తం ఏవ | = ఆయా భావమునే |
| కలేబరం | = దేహమును | ఏతి | = పొందుతాడు |
| త్యజతి | = విడిచి పెడతాడో | | |

**అర్జునా! మరణ కాలంలో ఎవడు ఏ భావాన్ని తలుస్తూ దేహాన్ని విడిచి పెడతాడో, వాడు తిరిగి ఆ భావాన్నే పొందుతాడు. ఎందుకంటే, ఆ భావమునే తలుస్తూ ఉన్నాడు కనుక.**

**వ్యాఖ్య**

**యద్భావం తద్భవతి**

జీవితంలో ఎవరు ఏది పొందినా, పొందడానికి ముందు దాని కొరకు ప్రయత్నించి ఉంటారు. ప్రయత్నించడానికి ముందు ప్రయత్నించాలి అనే సంకల్పాన్ని కలిగి ఉంటారు. ప్రయత్నించాలి అనే సంకల్పానికి ముందు దానిని ఎందుకు పొందాలి? దాని వల్ల ప్రయోజనం ఏమిటి? మొదలైన ఆలోచనలను చేసి, చివరికి పొందాలి అనే నిర్ణయానికి వచ్చి ఉంటారు. సాధ్యా సాధ్యాలన్నీ ఇలాగే సాధన క్రమంపై ఆధారపడి ఉంటాయి. మనిషి దేనిని భావిస్తాడో, అది హృదయాన్ని గాఢంగా పెనవేసుకు న్నప్పుడు ఆసక్తితో దాని కొరకు ప్రయత్నిస్తాడు. చివరికి దానినే పొందుతాడు. కారణం, ఎల్లప్పుడూ దానికి సంబంధించిన ఆలోచనే కలిగి ఉంటాడు కనుక ***(సదా తద్భావ భావితః).***

ఏ విత్తనం నాటితే ఆ చెట్టే వస్తుంది. తిండిని బట్టే కదా త్రేపు ఉంటుంది. పులిహోర తింటే పాయసం త్రేపు వస్తుందా? మారేడు నాటితే మామిడిపండు వస్తుందా? చర్యను బట్టే కదా ప్రతిచర్య!

జాగ్రదవస్థలో సాగిన ఆలోచనలే, భావనలే కలలను సృష్టిస్తాయి. మనసుకు తెలియనివి స్వప్నంలో అగుపించవు. ఇదీ అంతే. బ్రతుకులో సాగించిన భావాలే మరణ కాలంలో స్ఫురిస్తాయి. పూర్వాభ్యాస జనిత వాసనే అంత్యకాలంలో స్మరణ హేతువు అవుతుంది. అంతేగాని, అవసరమైన దానిని బ్రతుకులో భావించకుండా, మరణంలో స్మరిద్దా మనుకుంటే కుదరదు. జీవిత మంతా దేనిని దృఢంగా అభ్యసిస్తామో అదే మరణ కాలమున స్ఫురించి భవిష్యత్తును నిర్ణయిస్తుంది.

గతంలో మనం చేసిన భావాలే నేటి బ్రతుకును తయారు చేశాయి. నేడు మనం సాగించే భావాలే రేపటికి రూపు నిస్తాయి. ఇది నమ్మకం కాదు. శాస్త్రీయ మైన అవగాహన.

కేవలం స్మరించినంత మాత్రాన అనుకున్నది సాధించ గలమా? స్మరించడం ఒక్కటే సరిపోదు. తత్సంబంధ మైన కర్మాచరణము కూడా జరగాలి. ***పుణ్యేన పుణ్య లోకమ్*** - పుణ్యం చేత పుణ్య లోకము ప్రాప్తిస్తుంది అని ప్రమాణము. అంటే, కేవలం పుణ్యానికి సంబంధించిన భావన ఉంటే సరిపోతుందా? పుణ్య





భావన మాత్రమే ఉండి, పుణ్యకర్మ చేయని వానికి పుణ్యలోకం ప్రాప్తిస్తుందా? పుణ్యకర్మ ఫలితం పుణ్య లోకం గాని, పుణ్య భావన ఫలితం పుణ్యలోక ప్రాప్తి అని శాస్త్రం ఎక్కడా చెప్పలేదు. కాకపోతే, పుణ్య కర్మాచరణకు హేతువు పుణ్యభావనే. అలాగని కేవలం భావన చేతనే పొందడం సాధ్యం కాదు.

ఏ భావన మనస్సులో దృఢంగా ఉంటుందో, దానిని పొందడానికి మనిషి అవశ్యం శ్రమిస్తాడు. తత్ఫలితంగా ఫలాన్ని అందుకుంటాడు. మరణ సమయంలో ఏయే భావాన్ని కలిగి దేహాన్ని త్యజిస్తారో ***(యం యం భావం స్మరన్ చిన్తయన్ పరిత్యజతి ప్రాణ వియోగ కాలే కలేబరం),*** ఆయా భావానికి సంబంధించిన దానినే పొందుతారు కాని, వేరే దానిని పొందలేరు ***(తం తం ఏవ స్మృతం భావమ్ ఉపైతి నాన్యం).***

ఒక వ్యక్తి గొప్ప క్రీడాకారుడు కావాలని ఆశిస్తూ ఉంటాడు. శ్రమించి క్రీడాభ్యాసం చేయని కారణంగా క్రీడాకారుడు కాలేక పోతాడు. కాని, అదే ఆలోచన బుద్ధిలో కొనసాగుతూ ఉంటుంది. సదా అదే భావంలో ఉంటాడు కనుక ***(సదా తద్భావ భావితః)*** మరణ సమయంలో అతనికి అదే భావన స్ఫురించ వచ్చు. ఆ భావం తోనే మరణిస్తాడు కనుక, రాబోయే జన్మలో గొప్ప క్రీడాకారుడు అవుతాడు. ఎలా?

జీవిత మంతా క్రీడాకారుడు కావాలనే దృఢమైన భావన కలిగి ఉన్నందున, మరణ సమయంలో కూడా అదే భావన స్ఫురించింది. ఈ జన్మాంతంలో మరణ సమయాన ఏ భావన అయితే నిలిచిందో, రాబోయే జన్మలో ఆ భావనే ప్రథమంగా, ప్రధానంగా బుద్ధిలో ఉంటుంది. అతడిలో బాల్యం నుండే క్రీడాసక్తి మెండుగా ఉంటుంది. ఆసక్తి మెండుగా ఉంది కనుక అభ్యాసము కూడా నిండుగా జరుగుతుంది. తత్ఫలితంగా అతడు గొప్ప క్రీడాకారు డవుతాడు.

జీవితంలో దేనిని మనం గాఢంగా ఆలోచిస్తామో, భావిస్తామో, ఆచరిస్తామో, దాని ఫలితమే మరణ కాలంలో అంతిమ సంకల్పమై ఉంటుంది. చెట్టు లోని మధుర మైన ఫలము ఎలాగైతే చెట్టు యొక్క సారరూపమో, ఫలం లోని రసం ఎలాగైతే చెట్టు లోని సారం కన్నా వేరు కాదో, అలాగే మరణ కాలంలో స్ఫురించే అంతిమ సంకల్పం బ్రతుకులో సాగిన సంకల్ప కార్యాల సారభూతమే కాని, జీవన సారం కన్నా అన్యం కాదు.

చనిపోయిన తరువాత మనం ఏమౌతామో! ఎక్కడికి పోతామో! ఎలా ఉంటామో! ఇలాంటి ఆలోచనలకు ఈ శ్లోకం ఇంతటితో తెర దించింది అనే భావించ వచ్చు. మనం ఆశించిందే మనకు అందుతుంది. మనం భావించిందే మన భాగ్య మవుతుంది. మనం పోవా లనుకున్న చోటికే మనం చేరుతాము. పెట్టుబడి ఇక్కడ పెడితేనే, ఫలితాలు అక్కడ అందుతాయి. ఇక్కడ మతి - అక్కడ గతి. మరణ కాలంలో గతిని నిర్ణయించేది జీవిత కాలం లోని మతియే. అంత్య కాలంలో మతిలో నిలిచిన భావమే ఉత్తర జన్మలో గతిని నిర్ణయిస్తుంది ***(అంతే మతిః సా గతిః).*** పాల లోని సారభూత మైన పదార్థమే చివరకు వెన్నగా లభిస్తుంది. బ్రతుకు లోని జీవన సారమే ప్రాణ ప్రయాణ కాలంలో చివరి భావంగా స్ఫురిస్తుంది. బ్రతుకులో భాగం కానిది చావులో భాగం పంచుకోదు.

**ఆఖ్యాయిక**

**అంత్యకాలంలో అంగడి**

ఒక వ్యాపారి ఈ అంత్యకాల భావనపై ఆశ పెంచుకున్నాడు. మరణించిన తరువాత స్వర్గానికి వెళ్ళి అమృతపానం చేస్తూ అప్సరసల మధ్య అలా అలా అలౌకిక సుఖాలలో తేలి పోవాలని అభిలషించాడు. స్వర్గానికి చేరాలి అంటే యజ్ఞ యాగాది పుణ్య కర్మలు ఆచరించాలి. అలా ఆచరించడానికి చాలా ధనం వ్యయ మవుతుంది. అంత ధనం తన కెక్కడిది అని చింతించ సాగాడు.

ఇంతలో మరణ కాలంలో భగవన్నామాన్ని పలికితే చాలు. నీకు పుణ్య లోకాలు ప్రాప్తిస్తాయి అని ఎవరో అతనికి చెప్పారు. మరొక వివేకి అది విని, బ్రతుకంతా నామస్మరణ చేసిన వారే అంత్యకాలంలో భగవన్నామం పలుక గలరు అని అన్నాడు. వ్యాపారి ఆలోచించాడు. వ్యయం లేకుండా స్వర్గం లభించే ఈ అంత్యకాల భావనా వ్యవహారం బాగుందని నిశ్చయించుకున్నాడు. కాని, ఇంతలోనే దిగులు పట్టాడు.

నామం పలికే సంస్కారం తనకు లేదు. నామసాధన చేయలేడు. అలాగని స్వర్గాభిలాషను త్యజించ లేడు. ఏం చేయాలి? బాగా ఆలోచించి, తనకు వరుసగా పుట్టిన నలుగురు కుమారులకు నారాయణ, జనార్దన, మాధవ, ముకుంద అని పేర్లు పెట్టుకున్నాడు. భగవంతుణ్ణి పిలిచే సంస్కారం తనకు ఎలాగూ లేదు. పోనీ సంసార వ్యామోహంతో బిడ్డల్ని పిలిచినా, ఆ పేర్లు భగవంతుడివే కనుక తనకు పుణ్యలోకాలు తప్పక ప్రాప్తిస్తాయని గొప్ప పథకాన్నే రచించు కున్నాడు.

వృద్ధాప్యం వచ్చింది. మృత్యువు సమీపించింది. ప్రాణ ప్రయాణ సమయం దాపురించింది. వ్యాపారి గట్టి వాడే. అది మరణ కాలం అని గ్రహించాడు. ఇక ప్రాణం నిలవదు అని అర్థమై పోయింది. వెంటనే, నారాయణా! అని అరిచాడు. నాన్నా! అంటూ నారాయణుడు వచ్చాడు. జనార్దనా! అన్నాడు. జనార్దనుడు వచ్చాడు. మాధవా! అని కేక వేశాడు. మాధవుడూ వచ్చాడు. చివరగా ముకుందా! అని పిలవగానే ముకుందుడు కూడా వచ్చాడు. నలుగురిని చూచి, 'నలుగురూ వచ్చేశారా? మరి అంగడిలో ఎవరున్నారు?' అని పలికి కన్ను మూశాడు.

ఆశ బాగానే ఉంది. ఆలోచన బాగానే ఉంది. కాని ఆచరణలో లేనిది, అభ్యాసంలో ఉండనిది అంత్యకాలంలో ఉంటుందని భావించడమే బాగలేదు. అందుకే మిగిలింది **అంత్యకాలంలో** అంగడి.

ఈ శ్లోకంలో అర్జునుని ***కౌన్తేయా!*** అని సంబోధించాడు **భగవంతుడు**. ఇలా సంబోధించడం వెనుక సందర్భోచితంగా ఒక అద్భుతమైన జీవన రహస్యం దాగి ఉంది. **కౌంతేయా!** అంటే కుంతీకుమారా! అని అర్థము.

అర్జునా! విచారించకు. అంతిమ క్షణాన్ని తలచుకొని ఆవేదన చెందకు. అంతిమ క్షణం అపాయకరమే. భయంకరమే. దేహంలో నరాలు తెగుతూ ఉంటాయి. గుండె పట్టు తప్పి కొట్టుకుంటూ ఉంటుంది. ప్రాణం అల్లాడుతూ ఉంటుంది. మనస్సు స్పృహను కోల్పోతూ ఉంటుంది. ఇంద్రియాలు నిర్వీర్య మవుతూ ఉంటాయి. దేహం కంపిస్తూ ఉంటుంది. ఇటువంటి దారుణ మైన పరిస్థితులలో మనస్సు భగవంతునిపై నిలుస్తుందా? అని సంశయించకు. నువ్వు కౌంతేయుడివి. కుంతీదేవి కుమారుడివి.

కౌంతేయా! మీ అమ్మ జీవితాంతం భగవత్స్మరణ తోనే కాలం గడిపింది. ఏమి కావాలో కోరుకో అత్తమ్మా! అని నేను అభయ మిస్తే, కృష్ణా! నిన్ను మరపించే సుఖాలు నాకు వద్దు. నిన్ను స్మరించేందుకు అవసరమైన వైరాగ్యాన్ని కలిగించే ఆపదల్ని ప్రసాదించు అన్నది. బ్రతికినంత కాలం బుద్ధిని భగవంతుని యందే ఉంచి జీవించింది. మరణ సమయంలో దర్భ చాపను పరచుకొని, తూర్పు ముఖంగా ఆసీనురాలై, పవిత్ర మంత్రోచ్చారణలు చేస్తూ [illegible] భస్మం చేస్తుంది. నాయనా! ఆమె కడుపు తీపివి నువ్వు. ఆ తల్లి ప్రేగు త్రెంచుకొని పుట్టిన [illegible] ఆమె సంస్కారమే నీలో ఉంది. సంశయించకు. నడుము బిగించు. చెయ్యవలసింది [illegible] కౌంతేయ సంబోధనం ద్వారా తన హృదయం లోని భావనను బహిర్గతం చేశాడు భగవంతుడు.





***చివరి భావన ఏదో అదే*** దేహాంతర ప్రాప్తికి కారణ మవుతూ ఉంది. బ్రతుకులో సాగిందే చివరి ***భావనగా కొనసాగుతుంది.*** కనుక ఏమి చేయాలి?

**తస్మా త్సర్వేషు కాలేషు మా మనుస్మర యుధ్య చ ।** 7
**మ య్యర్పిత మనోబుద్ధి ర్మామే వైష్య స్యసంశయః ॥**

**తస్మాత్-సర్వేషు-కాలేషు-మాం-అనుస్మర-యుధ్య-చ**
**మయి-అర్పిత మనోబుద్ధిః-మాం-ఏవ-ఏష్యసి-అసంశయః**

| | | | | | |
|---|---|---|---|---|---|
| తస్మాత్ | = | అందువలన | మయి | = | నా యందు |
| సర్వేషు | = | సర్వ | అర్పిత | = | ఉంచిన |
| కాలేషు | = | కాలాలలో | మనోబుద్ధిః | = | మనోబుద్ధులతో |
| మాం | = | నన్ను | మాం ఏవ | = | నన్నే |
| అనుస్మర | = | అనుస్మరించు | ఏష్యసి | = | పొందుతావు |
| యుధ్య చ | = | యుద్ధము కూడా చెయ్యి | అసంశయం | = | సందేహము వద్దు |

**అర్జునా! అందుచేత, సర్వకాల సర్వావస్థల యందు నన్నే అనుస్మరిస్తూ నీ కర్తవ్య మైన యుద్ధం చెయ్యి. నీ మనస్సును, బుద్ధిని నాకే సమర్పించు. తప్పక నన్నే చేరుతావు. సందేహమే వద్దు.**

**వ్యాఖ్య**

నిరంతర స్మరణాభ్యాసము వలన కలిగిన చివరి భావన, అంటే మరణ సమయాన ఏర్పడిన అంత్య ప్రత్యయము (చివరి భావన) దేహాంతర ప్రాప్తికి కారణ మవుతూ ఉందని గడచిన రెండు శ్లోకాలలో అర్థం చేసుకున్నాం.

బ్రహ్మాత్మజ్ఞానము కలవాడే జ్ఞాని. అతనికి జీవిత కాలం లోనే తాను బ్రహ్మము అనే భావన దృఢపడి ఉంది కనుక, అంత్య భావనాపేక్ష జ్ఞానికి లేదు. మరణం తరువాత ప్రయాణం ఉండదు. స్థూలదేహం స్థూల భూతాల లోను, సూక్ష్మదేహం సూక్ష్మభూతాల లోను విలీనం కాగా, తాను అఖండాత్మ స్వరూపు డవుతాడు.

జ్ఞానులు కాని వారు జీవిత కాలంలో ఏ భావాన్ని గాఢంగా పెనవేసుకొని ఉంటారో, మరణ కాలంలో దానినే అంత్య ప్రత్యయంగా కలిగి దేహాంతర ప్రాప్తిని పొందుతారు. కనుక పూర్వాభ్యాస జనిత వాసన మరణ కాలంలో స్మరణ హేతువు కావడం చేత, జీవితంలో ఎలా నడచుకోవాలో సుస్పష్టమైంది. అందుచేత **(తస్మాత్)** సాధకుడు జీవితంలో ఏమి చేయాలో ప్రస్తుత శ్లోకంలో చెబుతున్నాడు. **తస్మాత్** అంటూ శ్లోకాన్ని ఆరంభించడానికి కారణం ఇదే.

**సంతతాభ్యాసము**

అన్ని కాలాలలో పరమేశ్వరునే అనుస్మరించాలి **(సర్వేషు కాలేషు, మా మనుస్మర).** స్మరించాలి అని ఆగకుండా అనుస్మరించాలి అని చెప్పడం చేత 'అను' అనే ఉపసర్గ ఏమిటో, ఎందుకో కూడా తెలుసుకోవాలి. ఈ అనుస్మరణము అన్ని కాలాలలో సాగాలి అంటున్నాడు. ఇక్కడ కాలాలు **(కాలేషు)** అని బహువచనం వాడటం జరిగింది.

వేసవికాలం, శీతాకాలం, వర్షాకాలం, రాహుకాలం అని చూడకుండా అన్ని కాలాలలో స్మరించాలి అని అర్థము. సుఖ కాలము లోను, దుఃఖ కాలములో కూడా అని భావము. పగటి కాలము మాత్రమే గాక రాత్రి

కాలము అని కూడా అర్థము. ఒక్క మాటలో చెప్పాలి అంటే నిద్రించే కాలంలో తప్ప అన్ని కాలాల లోను స్మరించాలి. అప్పుడే అంత్యకాలంలో పరమేశ్వరుని స్మరించడం కుదురుతుంది. ఆహార విహార ఆసన శయనాదు లందు కూడా విస్మరణము జరుగ కూడదు. సంక్లిష్ట మైన కాలంలో కూడా స్మరణము సాఫీగా సాగేటట్లు చూసుకోవాలి. స్మరణము అనుస్మరణంగా మారేటట్లు చూసుకోవాలి.

***అనుస్మర*** అన్నచోట ***యథా శాస్త్రం*** అని వ్యాఖ్యానించారు భాష్యకారు లైన శ్రీ శంకరులు. శాస్త్రవిధిని దృష్టిలో ఉంచుకొని ఆచరించ మని అర్థము. పరమేశ్వరుని స్మరించాలి అంటే, పరమేశ్వరుడు ఏమిటో తెలియాలి కదా! పరమేశ్వర జ్ఞానం ఎలా కలుగుతుంది? ప్రమాణం ద్వారానే కలుగుతుంది. శాస్త్రమే కదా మనకు ప్రమాణము! శాస్త్రము విశద పరచినట్లు, పరమేశ్వర స్వరూపమును విస్పష్టంగా శ్రవణం చేసి, మనన నిదిధ్యాసనల ద్వారా స్థిర పరచుకోవాలి. అధ్యయన మైనా, ఆచరణ మైనా సర్వ కాలాలలో శాస్త్రోక్త విధిని అనుసరించే సాగాలి. అదే అనుస్మరణము.

స్మరణాన్ని బట్టే మరణం ఉంటుంది. మరణ గతిని నిర్ణయించేది స్మరణమే. ఇది మామూలు విద్య కాదు. మరణ విద్య. బ్రతకడానికి ఎన్నో విద్యలు. అందరూ వాటి వెంటబడి పరుగులు తీసే వారే. అతి ప్రధాన మైన ఈ మరణ విద్యను పట్టించుకొనే వారు అరుదు. ఆ ప్రయత్నంలో వేల కొకడో, కోటి కొకడో మాత్రమే ఉంటాడు *(7 - 3)*.

పుట్టడంలో విశేష మేముంది? పశువులు కూడా పుడుతున్నాయి. చావడంలో మాత్రం విశిష్టత ఎక్కడుంది? జంతువులు కూడా చస్తున్నాయి. ***జంతూనాం నర జన్మ దుర్లభం*** - జంతువులలో మానవ జన్మే శ్రేష్ఠ మైనది అనేది ఋజువు కావాలంటే, ఆ సత్యము జనన మరణాలలో కాకుండా జీవితంలో కనిపించాలి. జీవితంలో వైభవం తొంగి చూస్తే, మరణం వైభవోపేతంగా శోభిస్తుంది. ఈ అవకాశం పశు పక్ష్యాదులకు లభించదు. మానవునికే ఉంది. నిమ్మళంగా ప్రాప్తిస్తుంది. మరణ యోగ్యత అన్ని ప్రాణులకీ ఉంది. యోగ్యమైన మరణం ఒక్క మానవునికే ఉంది. నిమ్మళంగా కూర్చుని సంధ్యావందనం చేయడం ఎవరికైనా సాధ్యమే. జనన మరణాల సంధ్యలో సతమత మౌతూ సర్వేశ్వరునికి వందనం అవడం ఎందరికి సాధ్యం? సర్వ కాలాలలో సర్వేశ్వరుని స్మరించిన వారికే సాధ్యం.

**కర్తవ్యతా నిష్ఠ**

సర్వ కాలాలలో నన్నే అనుస్మరిస్తూ, నీ కర్తవ్య మైన యుద్ధం కూడా చెయ్యి ***(అనుస్మర యుధ్య చ)*** అంటున్నాడు. సంతతాభ్యాసములో కొనసాగే వాడు కర్మయోగే కాని జ్ఞాని కాడు. మరి కర్మయోగి చేయ వలసిన కర్మ లన్నిటినీ త్యజించి ఈశ్వర స్మరణములో కాలం గడిపితే సంసారా లేమౌతాయి? అలాగని, లౌకిక మైన కార్యాలను ఆచరిస్తూ, విరామ కాలంలోనే అనుస్మరణం అంటూ జీవిస్తే, ***సర్వేషు కాలేషు మా మనుస్మర*** అనే భగవదాజ్ఞ ఎలా నెరవేరు తుంది? సంతతాభ్యాసం సాగడానికి కర్తవ్యాన్ని విస్మరించ నవసరం లేదు. పనిని పూజగా మార్చుకుంటే సరిపోతుంది. [illegible] కర్తవ్యతా నిష్ఠను కలిగి ఉంటే, కర్మలలో కూడా పరమేశ్వరుని అనుస్మరణమే సాగుతుంది.

సాధనలు రెండు [illegible] సాధన. రెండవది బహిరంగ సాధన. పూజా జప ధ్యానాదులు అంతరంగ సాధనలు. [illegible] సాధన. కర్మాచరణములో స్మరణము లోపిస్తే సాధన దెబ్బతింటుంది. [illegible] నన్నే అనుస్మరించు అని ఉపదేశించిన పరమేశ్వరుడు, నీ కర్తవ్య మైన యుద్ధం కూడా [illegible] అంటున్నాడు.





**ఇది అర్జునునికి ఉపదేశిస్తున్న** సందర్భము కనుక, నీ కర్తవ్య మైన యుద్ధాన్ని కూడా ఆచరించు అన్నాడు. **ఎవరి కర్తవ్య మేమిటో దానిని** ఆచరించాలి అనేది సామాన్య బోధ. సర్వులను ఉద్దేశించి చేసిన బోధ. ఇదే కర్మ యోగము. కర్మాచరణము సంతత స్మరణాభ్యాసాన్ని అడ్డగించకుండా, కొనసాగించే సాధనోపాయము.

కర్మయోగ సాధనోపాయము తెలిసి, తదనుగుణంగా జీవించే వారు సదా అనుస్మరణం లోనే కొనసాగుతూ ఉంటారు. చేయవలసింది ఏమిటో, చేయదగింది ఏమిటో చక్కగా అవలోకించి, ఆచరణమును ఆరాధనగా మార్చుకొని, ఇష్టాయిష్టాలను ప్రక్కకు నెట్టి, ధర్మాధర్మాలను వివేచించుకొని, ధర్మరూపంలో ఉన్నది దైవమే కనుక, ధర్మాచరణము దైవారాధనే అవుతుంది అనేది సదా దృష్టిలో ఉంచుకొని, ఏ పని చేస్తున్నా, నేను చేసే వాణ్ణి - ఈశ్వరుడు చేయించే వాడు, పరమేశ్వరుడు నియమించిన కార్యాన్ని శంకర కింకరునిగా **(ఈశ్వర భృత్యవత్)** శ్రద్ధతో ఆచరిస్తున్నాను అనే దృఢ నిశ్చయంతో కరచరణాదులు కర్మలలో కదులుతూ ఉంటే, అంతఃకరణములో స్మరణ దివ్యంగా సాగుతూ ఉంటుంది. ఇదే ధర్మనిష్ఠ. కర్తవ్యతా ధర్మనిష్ఠ. అర్జునుని విషయంలో అది యుద్ధమైతే మరొకరిది వ్యాపారము కావచ్చు. అలాగే ఉద్యోగ మైనా, మరే వ్యవహార మైనా.

**నిరంతర స్మరణము**

సర్వ కాలాలలో సర్వేశ్వరుని అనుస్మరిస్తూ జీవించ మన్నాడు భగవంతుడు. సంత తాభ్యాస జనిత సంస్కారము చేత మరణ కాలంలో భగవద్భావం **(మద్భావం)** స్థిరంగా నిలుస్తుందని, అది దేహాంతర ప్రాప్తికి హేతువు అవుతుందని ఉపదేశించాడు.

వచ్చిన దెపుడో తెలియదు ఎవరికి
పోయే రోజుందని తెలియని దెవరికి?
దారాసుతులు ధన దాయాదులు
కలిసి రాలేని రోజు అది
మట్టిలో కాయము కలవాలి
తోడొచ్చే దేమిటో తెలియాలి
రామ రామ జయ రాజారామ్
రామ రామ జయ సీతారామ్

అని రామజోగి చిట్కా.

ఇంతవరకు మనం ఈ శ్లోకంలో అర్థం చేసుకున్న దానిని బట్టి పనులు లేనపుడూ పూజ సాగుతూనే ఉంది. పనులు ఉన్నప్పుడు కూడా పనులలో పూజే కొనసాగుతూ ఉంది. ఎక్కడా, ఏ కాలం లోను స్మరణానికి భంగం వాటిల్లడం లేదు. ఒక మహాత్ముడు చెప్పినట్లు, రెండు చేతులతో సదా సర్వేశ్వరుని పాదపద్మాలను వాటేసుకొని భక్తుడు జీవిస్తూ ఉండాలి. పని కాలాలలో ఒక చేతితో పరమేశ్వరుని చరణాలను పట్టుకొని, మరో చేతితో కర్మ లాచరించాలి. పని పూర్తి కాగానే మళ్ళీ రెండు చేతులతో భగవంతుని చరణ కమలాలను పట్టుకోవాలి అన్నాడు.

పనిని పూజగా మార్చుకోవడం సాధ్యమేనా? కర్మాచరణంలో దైవారాధనము సాగుతుందా? అనే సందేహము చాలా మందిని వేధిస్తూ ఉంటుంది. బాగా ఆలోచిస్తే ఏ కార్యమూ సులభసాధ్యం కాదు. కాని, చేసే నేర్పు ఉన్న వారికి ఏ కార్యమూ కష్టం కాదు. శ్రద్ధాసక్తులు అసాధ్యాన్ని సాధ్యం చేస్తాయి. ప్రారంభంలో

మారాం చేసినా, క్రమేణ సాధన దివ్యంగా శోభిస్తుంది. ఒక వైపు కర్మలలో నైపుణ్యము గోచరిస్తూ ఉంటుంది. మరో వైపు స్మరణము నిరాటంకంగా సాగుతూ ఉంటుంది.

*శ్లో॥ పుంఖాను పుంఖ విషయేక్షణ తత్పరోపి*
*బ్రహ్మైవలోక ధియం న జహాతి యోగీ*
*సంగీత తాళ లయ నృత్త వశం గతోపి*
*మౌళిస్థ కుంభ పరిరక్షణధీ ర్నటీవ ॥*

రంగస్థలం పై నర్తకి జలపూర్ణ మైన చిన్న కుండను తలపై ఉంచుకొని హావ భావ విన్యాసాలను అభినయిస్తూ నాట్యం చేస్తూ ఉంటుంది. ఒక వైపు సంగీత, తాళ, లయ లను అనుసరిస్తూ నాట్యం చేస్తూనే, మరో వైపు తన తలపై ఉన్న జలపూర్ణ కుంభము పడి పోకుండా కాపాడుకుంటూనే నృత్యాన్ని కొనసాగిస్తూ ఉంటుంది.

అలాగే కర్మయోగి తన కళ్ళ ముందు కదిలే సమస్తాన్ని వీక్షిస్తూ, కరచరణాదులతో కర్మలను ఆచరిస్తూ ఉండినా, సదా పరమేశ్వరుని బుద్ధిలో స్మరించడము అనే కార్యాన్ని మాత్రం విడిచి పెట్టడు ***(న జహాతి).*** వృత్తులు మారుతున్నా ప్రవృత్తిలో మార్పు లేకుండా ఉంటాడు. ఇదే కర్మయోగ వైభవం.

కర్మయోగిలో నిరంతరం భగవత్స్మరణము, కర్మాచరణంలో స్వధర్మానుష్ఠానము నిండి ఉంటాయి. ధర్మాచరణ రూపంలో దైవారాధనము దివ్యంగా సాగుతూ ఉన్నందున, సర్వ కాలాలలో సర్వేశ్వర స్మరణం సాగిపోతూ ఉంటుంది. జీవితం లక్ష్య సిద్ధి వైపు సాగి ధన్య మౌతుంది. ఎందుకో తెలుసా? నిత్యస్మరణము అనే మహా యజ్ఞంలో అతని మనోబుద్ధులు సమిధలుగా సమర్పితా లయ్యాయి కనుక.

## సర్వం ఈశ్వరార్పణం

అర్జునా! సర్వ కాలాలలో నన్నే అనుస్మరిస్తూ, నీ కర్తవ్య మైన యుద్ధాన్ని కూడా దైవారాధనగా చేస్తూ, నీ మనోబుద్ధుల్ని నా యందే అర్పించు అంటున్నాడు గీతాచార్యుడు ***(మయి వాసుదేవే అర్పితే మనో బుద్ధీ యస్య తవ సః త్వం మయి అర్పిత మనోబుద్ధిః సన్ మామేవ యథా స్మృతమ్, ఏష్యసి ఆగమిష్యసి*** - శ్రీ శంకర భాష్యము). అర్జునా! మనోబుద్ధులను నా యందే సమర్పించి, నన్ను ఏ విధంగా అయితే అనుస్మరిస్తున్నావో, ఆ రూపం లోనే నన్ను పొందుతావు అని ఆచార్యుల వ్యాఖ్య. భాగవతం ఏకాదశ స్కంధంలో భగవంతుడు తన లీలా శరీరాన్ని త్యజించే ముందు ఉద్ధవునికి ఈ సత్యాన్నే చెబుతాడు. ఉద్ధవా! విషయాలను చింతించే చిత్తానికి విషయాలే విషయ మౌతాయి. నన్నే అనుస్మరించు చిత్తానికి ***(మామనుస్మరత చిత్తం)*** నేనే విషయ మౌతాను. ఆ చిత్తం నా యందే ఉంటుంది అన్నాడు ***(మయ్యేవ ప్రవిలీయతే).***

చిత్తాన్ని సమర్పించ మని ఉద్ధవునికి చెప్పినట్లు, ఇక్కడ కూడా మనస్సును సమర్పించ మని చెబితే సరిపోతుంది కదా! మనోబుద్ధుల్ని అర్పించ మనడం ఎందుకు? రెండూ ఒక్కటే కదా! మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము - కలిపే కదా అంతఃకరణము! అనే సంశయం సాధారణంగా కలుగుతుంది.

సంకల్పించేది మనస్సు. నిశ్చయించేది బుద్ధి. సంకల్ప నిశ్చయాలలో రాగద్వేషాలతో కూడిన అహంకారం తొంగి చూడకుండా ఈశ్వర భావనే స్ఫురించాలి. ఇది చాలా ప్రధాన మైన విషయం.

ఒక గొప్ప కార్యాన్ని నిర్వహించడానికి ముందు గొప్ప ఆలోచన ఉంటుంది. ఆలోచన మనస్సులో కలుగుతుంది. ఇంత గొప్ప ఆలోచన నాదే. నేనే చేశాను. నేనే చేయగలిగాను అనేది అహంకారము. అహంకారము నిండిన మనస్సు అచ్యుతుని ఎలా అనుస్మరిస్తుంది?





అలా కాక, ఈ విశిష్ట మైన సంకల్పము పరమేశ్వరుని అనుగ్రహంతో నా మనస్సులో స్ఫురించింది. ఇది ఈశ్వర సంకల్పం. ఈశ్వరాజ్ఞ. ఈ కార్యాన్ని నిర్వహించే భాగ్యం నాకు పరమేశ్వరుని చేత ప్రసాదించ బడింది. ఈ విధమైన భావన మనస్సులో కదిలితే, మనస్సును పరమేశ్వరునికి సమర్పించడం అవుతుంది.

మనస్సులో సంకల్పం జనించిన తరువాత, అది కార్యాచరణకు నోచుకోవాలి అంటే, బుద్ధి దానిని నిశ్చయించాలి. అలా నిశ్చయించే సందర్భంలో కూడా 'నేను' అనేది లేకుండా పరమేశ్వరుడే కర్త, నియంత, ప్రభువు, నేను ఆయన సేవకుణ్ణి, పనిముట్టును అనే భావనను కలిగి ఉంటే, బుద్ధిని పరమేశ్వరునికి సమర్పించినట్లు అవుతుంది. ఇదే **మయ్యర్పిత మనోబుద్ధిః** అంటే. సర్వ సంకల్పాలు సర్వేశ్వరార్పణం గావించడమే మనోబుద్ధులను పరమేశ్వరునికి సమర్పించడము.

సంకల్పాలు లేదా వృత్తులు ఎన్నున్నా, అవి రెండు విధాలు గానే ఉంటాయి. ఒకటి ఇదం వృత్తి, రెండవది అహం వృత్తి. 'ఇది' అని తెలియబడే దంతా ఇదం వృత్తి క్రిందికే వస్తుంది. 'నేను' అనే వృత్తి అహం వృత్తి. ఇదం వృత్తులను తెలుసుకొనేది అహం వృత్తి.

మనస్సుకు సంబంధించింది ఇదం వృత్తి. బుద్ధికి సంబంధించింది అహం వృత్తి. 'ఇదం' అంటే తెలియబడే జగత్తు. జగత్తు మనస్సుకు 'ఇదం'గా తెలుస్తూ ఉంది. జగత్తుగా తెలిసే 'ఇదం' జగదీశ్వరుడుగా తెలియాలి. కుండ 'ఇదం'గా మనస్సుకు తెలుస్తూ ఉండినా, అది మట్టిగా ఎలా విషయ మవుతుందో, అలాగే నామరూపాలతో నిండిన జగత్తు మనస్సుకు 'ఇదం'గా తెలుస్తూ ఉండినా, కుండలో మట్టి విషయ మైనట్లు, జగత్తులో పరమేశ్వరుడే విషయంగా తెలిసి రావాలి. ఈ కుండ లన్నీ మట్టే అని తెలిసినట్లు, ఈ జగత్తంతా ఈశ్వరుడే అనే స్ఫురణ కలగాలి ***(బ్రహ్మ ఏవ ఇదం విశ్వం ఇతి).*** ఇలా జరిగితే, ఇంతవరకు మనస్సుకు 'ఇదం'గా తోచిన ప్రపంచం అదృశ్యమై, భగవంతుడే మనస్సుకు 'ఇదం'లో విషయ మౌతాడు. వాస్తవానికి విషయి అయిన పరమేశ్వరుడు, విషయముగా కూడా తానే సాక్షాత్కరింపబడి నపుడు, అట్టి 'ఇదం' రూప ఈశ్వరునికి మనస్సు నైవేద్యంగా సమర్పింప బడుతుంది. మనస్సును మాధవునికి సమర్పించడం అంటే ఇదే.

సంకల్పించే మనస్సుకు 'ఇదం' రూపంలో ఈశ్వరుడు దర్శనీయు డైనట్లు, నిశ్చయించే బుద్ధికి కూడా 'అహం' రూపంలో ఈశ్వర స్వరూపము అనుభూతిగా నిలవడం జరిగి నపుడు, బుద్ధి కూడా పరమేశ్వరునికి సమర్పించ బడుతాయి. మనోబుద్ధులు నీరాజన మవుతుంది. ఈ విధంగా మనోబుద్ధులు పరమేశ్వరునికి సమర్పించ బడుతాయి. మనోబుద్ధులు సంపూర్ణంగా పరమేశ్వరుని యందే సమర్పితమై నందున, అట్టి మనోబుద్ధులను కలిగిన పుణ్యాత్ముడు ఎవరిని చేరుతాడు? ఎవ్వరినీ చేరడు, పరమేశ్వరుని తప్ప. అందుకే అతడు నన్నే పొందుతాడు అంటున్నాడు భగవంతుడు ***(మాం ఏవ ఏష్యసి ఆగమిష్యసి).*** అంతే కాదు, ఈ విషయంలో సందేహం అవసరం లేదు అని కూడా భరోసా ఇస్తున్నాడు ***(అసంశయః న సంశయః అత్ర విద్యతే).*** ఇంతకన్నా ఏమి కావాలి? ఎంత భాగ్యవంతులో గీతా భక్తులు! మరి వారి తక్షణ కర్తవ్యం ఏమిటి? సాధనలో సాగి పోవడమే. సాధ్యాన్ని సిద్ధింప చేసుకోవడమే. అదెలా? చెబుతున్నాడు. విందాం.

**అభ్యాస యోగయుక్తేన చేతసా నాన్యగామినా ।** 8
**పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచిన్తయన్ ॥**

అభ్యాస యోగయుక్తేన-చేతసా-నాన్యగామినా
పరమం-పురుషం-దివ్యం-యాతి-పార్థ-అనుచింతయన్

| | |
|---|---|
| పార్థ | = అర్జునా! |
| అభ్యాస యోగయుక్తేన | = అభ్యాస మనెడి యోగముతో కూడినది |
| న అన్యగామినా | = ఇతర విషయముల యందు ప్రవర్తింపనిది |
| చేతసా | = మనస్సు చేత |
| దివ్యం | = దివ్యుడు |
| పరమం | = ఉత్తముడు |
| పురుషం | = పురుషుని |
| అనుచింతయన్ | = స్మరిస్తూ |
| యాతి | = (అతనినే) పొందుతాడు |

**అర్జునా! మనస్సు అభ్యాస యోగం లోనే ఉండాలి. పరమాత్మను విడిచి ఇతరత్ర పోకూడదు. పరమేశ్వరుణ్ణి తదేకంగా చింతించాలి. అలా చేస్తే, దివ్యమైన పురుషోత్తముని పొందుతారు.**

**వ్యాఖ్య**

వెలుగులు ఆరిపోతే తిమిరాలు ముసురు కుంటాయి. స్మరణలు ఆగితే మనస్సును మాయాపొరలు కమ్ముకుంటాయి. దీపము లేని ఇంటి లోనే దొంగలు పడతారు. సాధకుడు నిరంతరం వెలుగులలో విహరించాలే గాని తిమిరాలలో తారాడ కూడదు.

**అభ్యాసమే యోగం**

నోరు దేని నైనా మ్రింగుతుంది. అలాగని విషం త్రాగిస్తామా? మనస్సు ఎక్కడి కైనా పోతుంది, ఎక్కడైనా ఉంటుంది. అలాగని ఎక్కడ పడితే అక్కడ ఉంచ వచ్చునా? ఉంచ కూడదు. ఉండనివ్వ కూడదు. తిన దగిందే నోటికి అందించినట్లు, ఉండదగిన చోటే మనస్సును ఉంచాలి. మనస్సు ఉండవలసిన చోటు, ఉండదగిన చోటు పరమేశ్వరుని సన్నిధానమే. అదొక్కటే మనస్సుకు వాసయోగ్య మైన చోటు. ***మయి ఈశ్వరే చిత్త సమర్పణ విషయ భూతే ఏకస్మిన్ తుల్య ప్రత్యయా వృత్తి లక్షణః*** - పరమేశ్వరుడు అనే ఒకే విషయానికి సంబంధించిన ఆలోచనలు నిరంతరం సాగుతూ ఉండాలి. అన్య విషయాలు ఈ ఆలోచనలకు అవరోధం కాకుండా ఉండాలి. ఇదే అభ్యాసము. ఈ అభ్యాసమే యోగము ***(స అభ్యాసః యోగః).*** ఇట్టి అభ్యాసముతో కూడిన చిత్తము అభ్యాస యోగయుక్తము.

అభ్యాసయోగము ఒక ప్రత్యేకమైన యోగము కాదు. కాని, ఏ యోగమైనా అభ్యాసం లేకుండా రాణించదు. ఈ విధంగా అన్ని యోగాలలో కలిసి, అన్నిటిని ప్రభావితం చేసే అభ్యాసము, యోగము కాని యోగమైంది.

ఉప్పు కూర కాదు. కాని, ఉప్పు లేని కూర ఉండదు. ప్రతి కూరలో ఉప్పు ఉంటుంది. అన్ని పదార్థాలలో ఉప్పు ఉంటూ, పదార్థాలకు రుచిని కలిగిస్తుంది. అలాగని, ఉప్పు ఒక్కటే పదార్థం కాలేదు. అభ్యాసం కూడా అంతే.

మనస్సుకు దేని మీద ఆసక్తి ఉంటుందో, అదే మనస్సులో నిలుస్తుంది. అలా మనస్సులో స్థిరపడిన విషయం చుట్టే సంకల్పాలు తిరుగుతూ ఉంటాయి. అన్యమైన విషయాలు ఎన్నయినా ఉండొచ్చు. వాటి మీద మనస్సుకు ఆసక్తి లేని కారణంగా సంకల్పాలు అటు వైపు పోవు.

సర్వ కాలాలలో పరమేశ్వరుని అనుస్మరిస్తూ, తన కర్తవ్యమును ధర్మనిష్ఠతో ఆచరించే కర్మయోగి తన మనోబుద్ధులను పరమేశ్వరునికే సమర్పించి ఉన్నందున, అతని సంకల్పాలన్నీ ప్రవాహ రూపంలో పరమేశ్వరుని వైపే సాగుతూ ఉంటాయి. ఇదే సజాతీయ ప్రత్యయ ప్రవాహము.

**విషయాంతర విహార శూన్యం**

అభ్యాసయోగం ప్రవాహ రూపంగా సాగాలి. ఏ విధమైన అవరోధాలు ఆ ప్రవాహాన్ని అడ్డగించ కూడదు. అడ్డగించేది ఏదైనా అది విజాతీయ ప్రత్యయమై ఉంటుంది. పరమేశ్వరుని కన్నా అన్య మైనదై ఉంటుంది.





అది ఏదైనా అనిత్యమే. అనిత్యాల వైపు పరుగులు పెట్టే మనస్సు నిత్యత్వాన్ని పొందలేదు. కనుక ఈశ్వరుని విషయంలో నిరాటంకంగా సాగే సజాతీయ ప్రత్యయ ప్రవాహానికి విజాతీయ ప్రత్యయ రూపాలు అడ్డు తగలకుండా చూసుకోవాలి. వివేక బుద్ధి ద్వారా అనిత్యాలను విశ్లేషించుకొని, లక్ష్యాన్ని పదే పదే మననం చేసుకొంటూ **(అనుచిన్తయన్)** అభ్యాస యోగాన్ని కొనసాగించాలి. అంటే, విజాతీయ వృత్తి రహిత సజాతీయ వృత్తి ప్రవాహం నిరంతరం సాగే లాగ సాధకుడు శ్రద్ధ వహించాలి.

**అనుధ్యానము**

పూర్వ శ్లోకంలో మనం చూచిన అనుస్మరణమే ఇక్కడ అనుచింతనముగా చెప్ప బడింది. అనుచింతనము అంటే పరమేశ్వరునికి సంబంధించిన విషయాన్ని శాస్త్రవిధి ననుసరిస్తూ, ఆచార్యోపదేశమును ఔదల దాల్చి ధ్యానించడము అని అర్థము ***(అనుచిన్తయన్, శాస్త్రాచార్యోపదేశమ్ అనుధ్యాయన్ ఇతి).*** ఇదే అభ్యాస యోగ యుక్త చిత్తము. ఆత్మాకార వృత్తి తప్ప అన్యవృత్తులు లేని అఖండ చిత్తము. అట్టి చిత్తములో సాగే స్మరణము లేదా ధ్యానము కూడా అఖండం గానే ఉంటుంది. ఈ అభ్యాస మంతా ఈశ్వరుని సన్నిధి లోనే సాగుతూ ఉంటుంది. ఈ కారణం గానే ఆలయాలలో అఖండ దీపాన్ని వెలిగిస్తారు. దృశ్యాలు అనిత్యాలని తెలిసి, దృశ్య విషయాలను త్యజించి, ధ్యేయ రూపుడైన పరమేశ్వరుని యందే చిత్తము అఖండంగా నిలిచి ఉండటము అఖండ ధ్యానము.

అఖండ దీపము ఎలాగైతే అన్య విషయాలను ప్రకాశింప చేయకుండా పరమేశ్వరునే ప్రకాశింప చేస్తూ ఉందో, అలాగే అఖండ ధ్యానస్థితిలో చిత్తము అభ్యాసయోగ యుక్తమై పరమేశ్వరుని సన్నిధి లోనే ఉంటుంది గాని, అన్య విషయాల వైపు పయనించదు ***(నాన్య గామినా).***

***నాన్యగామి*** అంటే అన్య విషయాల వైపు గమించని చిత్తము ***(న అన్యత్ర విషయాన్తరే గన్తుం శీలం అస్య ఇతి నాన్యగామి, న అన్యగామి).*** అట్టి చిత్తము చేత పరమేశ్వరుని అనుస్మరించాలి. అనుసంధానం చేయాలి. అన్యగామి కాని చిత్తము చేత పరమేశ్వరుని ధ్యానిస్తే పరమేశ్వరుని పొందడం జరుగుతుంది. ఆ పరమేశ్వరుడు ఎలాంటి వాడో కూడా చెబుతున్నాడు. ఆయన దివ్యమైన వాడు. పరమ పురుషుడు. 'పరమం' అంటే నిరతిశయుడు, 'దివ్యం' అంటే ప్రకాశైక రూపుడు అని అర్థం. అట్టి దివ్యమైన పరమ పురుషుణ్ణి ఇతరత్ర చరించకుండా అభ్యాస యోగ యుక్తమై ఉన్న చిత్తము చేత అనుస్మరించే పుణ్యాత్ములు తప్పక అతనినే పొందుతారు.

*ఎలాంటి లక్షణాలు కలిగిన పరమ పురుషుని పొందుతారో చెబుతున్నాడు.*

**కవిం పురాణ మనుశాసితార మణోరణీయాంస మనుస్మరేద్యః ।** 9
**సర్వస్య ధాతార మచిన్త్యరూప మాదిత్యవర్ణం తమసః పరస్తాత్ ॥**

**కవిం-పురాణం-అనుశాసితారం-అణోః-అణీయాంసం-అనుస్మరేత్-యః**
**సర్వస్య-ధాతారం-అచిన్త్యరూపం-ఆదిత్యవర్ణం-తమసః-పరస్తాత్**

| | |
|---|---|
| కవిం | = సర్వజ్ఞుడు |
| పురాణం | = శాశ్వతుడు |
| అనుశాసితారం | = నియంత |
| అణోః | = అణువు కంటె |
| అణీయాంసం | = సూక్ష్మమైన వాడు |
| సర్వస్య | = సమస్తమునకు |
| ధాతారం | = సృష్టికర్త |
| అచిన్త్యరూపం | = ఊహింప శక్యము గాని రూపము గలవాడు |
| ఆదిత్యవర్ణం | = సూర్య ప్రకాశము గలవాడు |
| తమసః | = చీకటి కంటె |
| పరస్తాత్ | = వేరైన వాడు |

**అర్జునా! ఆ పరమ పురుషుడు కవి. పురాతనుడు. శాసించే వాడు. అణువు కంటే చిన్నవాడు. సర్వానికి ఆధారమైన వాడు. ఊహకు అందని వాడు. ఆదిత్య రూపుడు. తమస్సుకు ఆవలి వాడు. అట్టి పురుషుణ్ణి స్మరించే వాడు అతణ్ణే పొందుతాడు.**

**వ్యాఖ్య**

సత్యం మనకు అర్థం కావాలే కాని, మనకు అర్థమైనది సత్యంతో విభేదించ కూడదు. భగవంతుడు సత్యరూపుడు. జ్ఞాన స్వరూపుడు. అనంతుడు. ఇది సత్యం. శాస్త్ర ప్రతిపాదితం.

పరమేశ్వరుడు సృష్టికర్త. ఆ లోకంలో ఉంటాడు. ఈ లోకంలో ఉంటాడు. నమ్మితే రక్షిస్తాడు. నమ్మకపోతే శిక్షిస్తాడు. ఇవన్నీ మన అభిప్రాయాలు. ఊహాజనితాలు. వాస్తవాలు కావు. సత్యదూరాలు. ఇవి మన అనుభవంతో, యుక్తితో విభేదిస్తున్నాయి కనుక ఇక్కడ విచారమే కర్తవ్యం కావాలి. అది కూడా బుద్ధితో చేసే విచారం కాకుండా ప్రమాణ విచారంగా ఉండాలి. అప్పుడే సత్య మేమిటో తెలుస్తుంది. కనుక, సత్యరూపు డైన పరమేశ్వరుని ఎలా అర్థం చేసుకోవాలో, ఆయన దివ్యమైన లక్షణాలు ఏమిటో ఈ శ్లోకంలో వర్ణిస్తున్నాడు.

**కవి**

భగవంతుడు కవి. కవి అనగానే మన మనస్సులో కొన్ని ఆలోచనలు కదుల్తాయి. కవిత్వము చెప్పేవారు, కథలు వ్రాసేవారు, పద్యాలు రచించే వారు, పాటలు అల్లే వారు - వీరందరూ కవులు అనేది మన అభిప్రాయము. వారు కవులు కారని నేను అనడం లేదు. కాని, భగవంతుడు మనకు అర్థమయ్యే ఈ కవుల లాంటి వాడు అని భావిస్తే మాత్రం ప్రమాదం అంటున్నాను. అప్పుడు భగవంతుడు కూడా భావాన్వేషణలో పరుగు లెత్తేవాడు కావలసి వస్తుంది. భావాలు రాలేదని నిరాశతో నిరీక్షించే వాడు కావలసి వస్తుంది. ప్రత్యేకమైన కాలం కోసం, దేశం కోసం ప్రాకులాడే వాడు కావలసి వస్తుంది. కవి సమ్మేళనాలకు హాజరు కావలసి ఉంటుంది. సన్మానాలకై ఎదురు చూడవలసి ఉంటుంది. అలాంటి వాడు కవి కాగలడేమో కాని భగవంతుడు కాలేడు. భావాల వెంట భావాపేక్షతో, భావావేశంతో పరుగులు తీసేవాడు కాక, భావ చలనానికి ఆధారమైన చైతన్యమే భగవంతుడు. కనుక, భగవంతుడు ఎలాంటి కవీశ్వరుడో ప్రమాణం ద్వారానే గ్రహించాలి.

భగవంతుడు కవి. కవి అంటే క్రాంతదర్శి. సర్వజ్ఞుడు ***(కవిం క్రాన్తదర్శినం సర్వజ్ఞం).*** అంటే త్రికాలజ్ఞుడు. మూడు కాలాలకు సంబంధించిన పూర్ణ జ్ఞానం కలవాడు. 'క్రాంతం' అంటే అతీతము. క్రాంతదర్శి అంటే అన్నిటికీ అతీతమైన దృష్టి కలవాడు. నేడున్నవే మనస్సుకు తెలుస్తాయి. గతంలో ఉన్నవి తెలియవు. భవిష్యత్తులో ఉండబోయేవి అర్థం కావు. పరమేశ్వరుడు మనస్సు కాదు. మనస్సుకు ఆధారమైన వాడు. ఊహలకు ఆలంబనమైన వాడు. అందరి ఊహలకు, అన్ని కాలాల లోని వ్యక్తుల సంకల్పాలకు ఆయనే ఆశ్రయము. కనుక నేడున్నవి ఆయనకు తెలుసు. గతంలో ఉండినవి, భవిష్యత్తులో ఉండబోయేవి కూడా తెలుసు. అందుకే, భగవంతుడు సర్వజ్ఞుడు. క్రాంతదర్శి. కవి.

పరమేశ్వరుని వంటి కవిని మరొకరిని చూడలేము. ఊహించలేము కూడా. పరమేశ్వరుని వంటి కవి మరొకడు ఉంటే, ఆ ఇరువురూ మానవుల వంటి మామూలు కవులు అవుతారే గాని, వారిలో ఏ ఒక్కడూ భగవంతుడు కాలేడు. సర్వజ్ఞుడు ఒక్కడే గాని రెండుగా తెలియడు. కనుకనే సర్వదృక్ చైతన్యంగా శోభించే పరమేశ్వరుని వంటి కవి మరొకడు ఉండలేడు అన్నది ఉపనిషత్తు. ***నాన్యతోఽస్తి ద్రష్టా*** - పరమేశ్వరుని వంటి సర్వద్రష్ట మరొకడు లేడు అన్నది బృహదారణ్య కోపనిషత్తు.





**పురాణుడు**

కవి అయిన భగవంతుడు పురాణుడు. అంటే చిరంతనుడు, పురాతనుడు **(పురాణమ్ చిరంతనమ్, పురాతనమ్).** అంటే సదా ఉండేవాడు. కాలానికి అతీతమైన వాడు. పురాణ శబ్దార్థం భగవంతుడు అంటే ఏమిటో చక్కగా మన హృదయానికి పట్టిస్తుంది.

***పురా పూర్వస్మిన్ భూతం ఇతి పురాణమ్*** - పూర్వము ఉన్నది కనుక పురాణము అనేది ఒక అర్థం. ఈ అర్థాన్ని అనుసరించి చూస్తే, భగవంతుడు పూర్వం ఉన్నవాడు అవుతాడు. అంటే, ఇప్పుడు లేనివాడు అనే అర్థం వస్తుంది. పూర్వం ఉన్నవారు ప్రస్తుతం లేరు. పూర్వం ఉన్నవి నేడు కనిపించడం లేదు. కారణం, అవన్నీ కాలగతాలు. పరమేశ్వరుడు కూడా కేవలం పూర్వం ఉన్నవాడే అయితే, నేడు లేనివాడు అవుతాడు. అందరి లాగే అనిత్యుడు అవుతాడు. కనుక, భగవంతుని **పురాభవమ్** అనే అర్థంతో చూడ కూడదు.

***పురాఽపి నవం ఇతి పురాణం*** - పురాతనమైనా నిత్య నూతనంగా భాసించేది పురాణము. పూర్వం ఉన్నవి ఏవైనా అవి కాలంలో కళావిహీన మౌతాయే గాని నిత్యనూతనంగా ఉండలేవు. అలా ఉండటం భగవంతుని కొక్కనికే సాధ్యం. ఎందుకో తెలుసా! ఆయన కాలానికి పరిమితుడు కాడు ***(కాలేన అపరిచ్ఛిన్నత్వాత్).*** అందుచేత కాలాతీతుడైన తాను అన్ని కాలాలలో దివ్యంగా ప్రకాశిస్తాడు. ఇలా మరొకరు ఉండే అవకాశం లేదు కనుక, పురాతనాల కన్నా అతడు పురాణుడు. కనుక సమస్తాన్ని శాసించ గలడు.

**అనుశాసితారుడు**

***అనుశాసితారమ్*** అంటే సమస్త విశ్వాన్ని శాసించే వాడు అని అర్థము ***(సర్వస్య జగతః ప్రశాసితారమ్).*** పరమేశ్వరుడు నియంత. విశ్వం లోని నియతిని ఏర్పరచింది తానే. జగత్తులో శాంతిభద్రతలు తన మీదే ఆధారపడి ఉన్నాయి. ఆయన ప్రభువు. ధర్మరూపుడు. విశ్వం ఏ ధర్మాలపై ఆధారపడి కొనసాగుతూ ఉందో, అట్టి ధర్మరూపంలో తానే ఉన్నాడు. బాహ్యాభ్యంతరాలలో ఉండి, అటు విశ్వాన్ని, ఇటు వ్యక్తిని శాసిస్తున్నాడు.

***భీషాఽస్మాద్వాతః పవతే*** - భగవంతునికి భయపడి గాలి ప్రపంచంలో వీస్తూ ఉంది అని తైత్తిరీయోపనిషత్తు ఆనంద మీమాంసలో ప్రవచించింది. ఏ పరమేశ్వరుడు విశ్వంలో వాయువును శాసిస్తున్నాడో, అతడే వ్యక్తిలో ప్రాణాన్ని శాసిస్తున్నాడు.

***భీషోదేతి సూర్యః*** - పరమేశ్వరునికి భయపడి సూర్యుడు ఉదయిస్తున్నాడు. బాహ్యంలో వేడికి, వెలుగుకు కారణమైన సూర్యదేవుని శాసిస్తున్న భగవంతుడే వ్యక్తిలో వేడికి, వెలుగుకు కారణమై ఉన్నాడు. సర్వ ధర్మాలు అతని అధీనం లోనే ఉన్నాయి. అలాంటి అనంత శక్తిమంతుడు సర్వవ్యాపిగా ఉంటాడు. సూక్ష్మరూపుడై ఉంటాడు.

**సూక్ష్మాతి సూక్ష్మం**

అన్నిటి కంటే సూక్ష్మ మైనది పరమాణువు. దాని కంటే భగవంతుడు సూక్ష్మమైన వాడు. కనుక ఆయన అణువు కన్నా సూక్ష్మమైన వాడుగా కీర్తింప బడ్డాడు ***(అణోః సూక్ష్మాత్ అపి, అణీయాంసం సూక్ష్మతరమ్).*** సమస్త అణువణువులో సూక్ష్మరూపంతో అతడే వ్యాపించి ఉన్నాడు కనుక, సమస్తానికి ఆధారమైన వాడు తానే. సమస్త భూతాలకు ఆకాశం ఆధారము. అట్టి ఆకాశానికి కూడా ఆధారమైన వాడు కనుక ఆయన సర్వాధారుడు.

**సర్వాధారుడు**

సమస్తానికి ఆధారమైన వాడు. సమస్తాన్ని ధరించే వాడు. సర్వాన్ని పోషించే వాడు. సర్వమును సంరక్షించే

వాడు. చలనచిత్రాలకు తెర ఆధార మైనట్లు, సమస్త విశ్వానికి ఆధారభూతుడు. ప్రాణులకు కర్మఫలాన్ని అనుగ్రహించే వాడు.

**అచింత్య రూపుడు**

ఊహలకు అందని రూపము కలవాడు. ఆలోచించడానికి వీలు లేనివాడు. అతనిని ఎవ్వరూ చింతించ లేరు. మరి, లేని దానిని కూడా చింతించడం సాధ్యపడదు కదా! పరమేశ్వరుడు కూడా చింతింప బడడు అంటే ఆయన కూడా లేనివాడే నేమో! అనే సందేహం కలుగవచ్చు.

ఈ విధమైన సందేహానికి అవకాశం లేకుండా, ఇంద్రియ మనస్సులకు అందని పరమేశ్వరుడు బుద్ధి చేత గ్రహింప బడుతాడు ***(బుద్ధిగ్రాహ్య మతీంద్రియమ్)*** అని ఆరవ అధ్యాయం లోనే చెప్పడం జరిగింది. ప్రస్తుత శ్లోకంలో కూడా **అనుస్మరేత్** అంటూ స్మరించ దగినవాడు అని స్ఫురింప చేస్తున్నాడు కనుక, మనస్సు చేత చింతించడానికి వీలుపడని వాసుదేవుడు బుద్ధి వృత్తి చేత, జ్ఞానవృత్తి చేత, అఖండ బ్రహ్మాకార వృత్తి చేత, ఏకభావ అవగాహినీ వృత్తి చేత తెలియ బడుతాడు అని అర్థము.

**ఆదిత్య రూపుడు**

అచింత్య రూపుడు అంటే రూపం లేని వాడు అనుకుంటారేమో! కాదు, కాదు. తనదైన ప్రత్యేక రూపము కలవాడు అని అర్థం. అదే ఆదిత్య రూపం. అంటే సూర్యుని వంటి రూపము కలవాడు. సూర్యుడు ఏ విధంగా ప్రకాశరూపుడో, పరమేశ్వరుడు కూడా అలాగే ప్రకాశైక స్వరూపుడు ***(ఆదిత్యస్య ఏవ నిత్య చైతన్య ప్రకాశః వర్ణః యస్య తమ్ ఆదిత్యవర్ణమ్).*** అలాగని, ప్రకాశం లేని వాటిని ప్రకాశింప చేసే కర్తవ్యము కలవాడు అని అర్థం చేసుకో కూడదు. సూర్యుడు తనకు తానుగా ప్రకాశిస్తూ ఉంటే, తన వెలుగులో సమస్తము ఎలాగైతే ప్రకాశిస్తూ ఉందో, అలాగే పరమేశ్వరుని ప్రకాశములో విశ్వమంతా ప్రకాశిస్తోంది ***(తస్య భాసా సర్వమిదం విభాతి)*** అని గ్రహించాలి.

**మాయాతీతుడు**

తమస్సు అంటే చీకటి. ***పరస్తాత్*** అంటే వేరైన వాడు, లేక అవతల ఉన్నవాడు అని అర్థము. చీకటి అనేది అజ్ఞాన లక్షణము. అజ్ఞాన లక్షణమైన మోహ మనే అంధకారానికి అతీతుడు ***(అజ్ఞాన లక్షణాత్ మోహాన్ధ కారాత్ పరం)*** అని అర్థము.

చీకటిలో ఏదీ కనిపించదు. కారణం, వెలుగు లేకపోవడమే. వెలుగు ఎక్కడ లేదు? బాహ్యంలో లేదు. బాహ్యంలో అంతేగాని, వెలుగు అసలే లేకుండా పోలేదు. వెలుగు లేకపోతే చీకటి ఉందని తెలిసేం దెవరికి? వెలుగు లేని కారణంగా చీకటి అలుముకున్నా, అలా చీకటి ఉంది అని మనకు తెలియడానికి మనలోని వెలుగే కారణము. అదే ఆత్మ చైతన్యము. ఆత్మయే బ్రహ్మము. కనుక, అజ్ఞానాంధకారానికి అతీతంగా చైతన్య జ్యోతి దివ్యంగా ప్రకాశిస్తోంది. అది తమస్సుకు పరమైనది. స్వప్రకాశ మైనది. సమస్తానికి పరమైన అట్టి పరబ్రహ్మమునకు పరమైనది మరొకటి లేదు ***(యస్మాత్ పరం న అపరం అస్తి కించిత్).***

పురాణ పురుషుడైన కవి నుండి ఆదిత్య రూపుడైన పరబ్రహ్మము వరకు, ఇంతదాకా మనం చూచిన లక్షణా లన్నీ అద్భుత మైనవి. ఈ లక్షణాలపై నిదిధ్యాసనం చేసిన వాడు బ్రహ్మమునే పొందుతాడు. వేదంలో అనేక చోట్ల ఈ లక్షణాలు మంత్రరూపంలో కనిపిస్తాయి.





***వేదాహ మేతం పురుషం మహాన్తం ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్***
***తమేవ విదిత్వా అతిమృత్యుమేతి నాన్యః పంథా విద్యతేఽ యనాయ ॥***

అన్నది ఉపనిషత్తు. బ్రహ్మమును తెలుసుకున్న వాడు మృత్యువును దాటి పోతున్నాడు అని మంత్రం స్పష్టం చేస్తూ ఉంది. అంటే, అమృతత్వమును పొందుతున్నాడు అని అర్థం. మోక్షానికి మరో మార్గాన్ని శ్రుతి అంగీకరించడం లేదు. పరమేశ్వరుడు జ్ఞానరూపంలో ఉన్నందున ఆయనను తెలుసుకోవడానికి జ్ఞానమే ఏకైక మార్గము.

***తమస్త దాసీత్ గహనం గభీరం యస్తస్య పారేఽ భివారజతే విభుః*** - మాయా తిమిరానికి ఆవల ప్రకాశించు వానిని స్మరిస్తాను అని వ్యాస భాగవతము. **పెంజీకటి కవ్వల నెవ్వం డేకాకృతి వెలుగు నతని నే సేవింతున్** - అని పోతనామాత్యుని ఆంధ్ర భాగవతము.

ప్రస్తుత శ్లోకంలో అష్ట లక్షణాలతో స్పష్టంగా భాసిస్తున్న పరమేశ్వరుణ్ణి **అనుస్మరేద్యః** - ఎవడైతే స్మరిస్తున్నాడో అని మాత్రమే ఉంది. మరి, స్మరించిన వాడు ఏమౌతాడు? దానికి సంబంధించిన క్రియాపదము శ్లోకంలో లేదు. ఎవడు బ్రహ్మమును స్మరించు చున్నాడో వాడు బ్రహ్మమునే పొందుతాడు అని పూర్వ శ్లోకంతో అన్వయించుకోవాలి. ***తమ్ అనుచిన్తయన్ యాతి*** - అతనిని అనుస్మరించే వాడు అతనినే పొందుతాడు అని గడచిన శ్లోకంలో ఉన్న దానితో ఈ శ్లోకానికి ఉండే సంబంధాన్ని గుర్తించాలి ***(యాతి ఇతి పూర్వేణైవ సంబంధః).*** ప్రస్తుత శ్లోకంలో **అనుస్మరేద్యః** అన్నదే పూర్వ శ్లోకంలో **అనుచిన్తయన్**, అంటే అనుస్మరణమే అనుచింతనము. ఇది శాస్త్రాన్ని, గురుబోధను అనుసరించి గ్రహించ వలసిన జ్ఞాన విషయము.

*పరమాత్మను స్మరించ వలసిన విధానాన్ని వివరించిన తరువాత ప్రయాణ కాలంలో అనుసరించ వలసిన సాధన విషయాన్ని స్పష్టం చేస్తున్నాడు.*

ప్రయాణకాలే మన సాఽచలేన భక్త్యా యుక్తో యోగబలేన చైవ ।
భ్రువోర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్ స తం పరం పురుష ముపైతి దివ్యమ్ ॥ 10

**ప్రయాణకాలే-మనసా-అచలేన-భక్త్యా-యుక్తః-యోగబలేన-చ-ఏవ**
**భృవోః-మధ్యే-ప్రాణం-ఆవేశ్య-సమ్యక్-సః-తం-పరం-పురుషం-ఉపైతి-దివ్యం**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్రయాణకాలే | = | మరణ కాలమున | ఆవేశ్య | = | నిలిపి |
| అచలేన | = | చలనము లేని | తం | = | ఆ పురుషుని |
| మనసా | = | మనస్సుతో | యః | = | ఎవడు |
| భక్త్యా | = | భక్తితో | అనుస్మరేత్ | = | స్మరిస్తాడో |
| యోగబలేన చ ఏవ | = | యోగబలముతో | సః | = | అతడు |
| యుక్తః | = | కూడినవాడు | దివ్యం | = | దివ్యుడు |
| భ్రువోః మధ్యే | = | భ్రూమధ్యము నందు | పరం | = | సర్వోత్తముడు |
| ప్రాణం | = | ప్రాణమును | పురుషం | = | పురుషుని |
| సమ్యక్ | = | నిలకడగా | ఉపైతి | = | పొందుతున్నాడు |

**అర్జునా! మరణ సమయంలో మనస్సు నిశ్చలంగా ఉండాలి. భక్తి భావంతో ఉండాలి. యోగ బలంతో ఉండాలి. భ్రూమధ్యంలో ప్రాణాలను చక్కగా నిలపాలి. దివ్యమైన పరబ్రహ్మమును పొందాలి.**

## వ్యాఖ్య

**జీవ యానము**

మరణం అంటే ఏదో కాదు, మార్పే మరణం. ప్రపంచంలో మనకు గోచరించే దంతా మార్పే. అలాగే, మన దేహంలో కూడా నిరంతరం మార్పులు జరుగుతూనే ఉన్నాయి. వాస్తవం చెప్పాలంటే, నిమిషాలు కాదు కదా, కనీసం కొన్ని క్షణాలైనా మనలో ఏ మార్పు లేకుండా ఉండటం సాధ్యం కాదు. నిరంతరం మార్పు జరుగుతూనే ఉన్నా, ఆ జరిగే మార్పు మనకు తెలియకుండానే జరిగిపోతూ ఉంది. మనలో జరిగే మార్పుని ఇతరులు గుర్తించి చెప్పినపుడు, అవునా, నిజమేనా! అని ఆశ్చర్యపోతూ ఉంటాము. మనలో జరిగే ఈ పరిణామాన్ని మనమే గుర్తించలేక పోవడానికి కారణ మేమిటో తెలుసా? మార్పు చెందనిది కూడా మనకు అర్థం కాకుండా మన లోనే ఉండటం. ఒక విధంగా చెప్పాలంటే ఇటు జీవితాశకు, అటు మరణ భయానికి, రెండిటికి ఇదే కారణము. చావు అనగానే ఎవరైనా భీతి చెందుతారు. అవినాశి యైన జీవస్వరూపము నశించే పాంచభౌతిక దేహంతో తాదాత్మ్యం చెందడమే ఈ మరణభయానికి, మహాభయానికి కారణము. మరణం భయకారణం కాదు. మరణానికి సంబంధించిన జ్ఞానం లేకపోవడమే భయ కారణము. మరణం అనేది శిక్ష కాదు. అదొక శిక్షణ.

మరణంలో ఏ నష్టమూ లేదు. అక్కడ జరిగే దంతా కేవలం మార్పే. ఒక దేశ కాల పరిధి నుండి మరొక దేశ కాల పరిధి లోకి ఇల్లు మారినట్లు మారడమే మరణంలో జరుగుతూ ఉంది. ఒకే ద్వారం గుండా వ్యక్తి విశ్వం లోకి ప్రవేశించి ఉండొచ్చు. అలాగని ఒకే ద్వారం గుండా నిష్క్రమించాలనే నియమ మేమీ లేదు. మనం ఈ ప్రపంచం నుండి నిష్క్రమించడానికి చాలా ద్వారా లున్నాయి. ఏ ద్వారం నుండి ఎవరు నిష్క్రమిస్తారు? అలా దేహం నుండి నిష్క్రమించిన తరువాత ఏయే మార్గాలలో పయనిస్తారు? ఎక్కడెక్కడికి చేరుతారు? మొదలైన ఆసక్తికర మైన విషయాలను ఇక ఈ అధ్యాయంలో చూడబోతాము.

ఇంతవరకు 'మరణ సమయంలో సాధకుడు' అనే విషయాన్ని విస్తారంగా విమర్శించి విశ్లేషించుకున్నాం. మరి, మరణ సమయంలో యోగులు స్వచ్ఛందంగా మరణించడం కూడా ఉంది. అంటే, ప్రాణం పోయే సమయంలో అవసర మని భావిస్తే, ప్రాణ నిష్క్రమణాన్ని ఆపి, తన అభీష్టానికి అనువైన కాలంలో యోగి ప్రాణాన్ని త్యజిస్తాడు. అదే స్వచ్ఛంద మరణము. ఇది సామాన్యులకు సాధ్యమయ్యే విషయం కాదు. యోగబలం కలవారే దానికి అర్హులు. యోగబలం గల యోగి మరణ సమయంలో ***(ప్రయాణ కాలే మరణకాలే)*** నిశ్చలమైన మనస్సు కలవాడై ***(మనసా అచలేన చలన వర్జితేన)*** భక్తితో, యోగబలంతో కూడిన వాడై ***(భక్త్యా యుక్తః యోగస్య బలం యోగబలం, తేన చ యుక్తః)***, భ్రూమధ్యంలో ప్రాణమును నిలిపిన వాడై ***(భ్రువోః మధ్యే ప్రాణమ్ ఆవేశ్య స్థాపయిత్వా)***, ఏమరుపాటు లేని వాడై ***(సమ్యక్ అప్రమత్తః సన్)***, పూర్వ శ్లోకంలో మనం చూచిన ***కవిం, పురాణం*** మొదలైన లక్షణాలు గల ఆ దివ్యపురుషుని పొందుతాడు.

**చిత్త నైశ్చల్యము**

మరణ కాలంలో యోగి యొక్క మనస్సు నిశ్చలంగా ఉంటుంది. గాలి లేని చోట దీపం లాగా చలన రహితంగా ఉంటుంది. యోగ సాధనలో దేనిని సాధించాలన్నా మనస్సే ప్రధానమై ఉంటుంది. ***మనసైవాఽను [illegible]*** - నిశ్చలమైన మనస్సు చేతనే పరతత్వాన్ని దర్శించ వలసి ఉంటుందని ఉపనిషత్తు కూడా ప్రవచించింది. [illegible] మనస్సు చలిస్తే, ముఖ్యంగా మరణ సమయంలో, యోగం పట్టు తప్పుతుంది.

మనస్సు ప్రియంగా ఉండాలి. అసంతృప్తి లేని మనస్సే నిశ్చలంగా ఉంటుంది. ధ్యానం లోనే మనస్సు





నిశ్చలంగా ఉండటం అవసరం. ఇక మరణ సమయంలో చలిస్తే ప్రయోజనం ఉంటుందా? మరణ సమయంలో పరమేశ్వరుని అనుస్మరించడానికి మనస్సు నిశ్చలంగా ఉండాలి అంటే, పరమేశ్వరునిపై అచంచల మైన భక్తి ఉండాలి. ఆసక్తి లేని చోట, ప్రియత్వం లేని చోట మనస్సు నిశ్చలంగా ఉండలేదు. పరమేశ్వరుని యందు పరమ ప్రియత్వమే భక్తి కనుక, యోగికి నిశ్చలమైన మనస్సు, అకుంఠిత మైన భక్తి ఉండి తీరాలి.

**పరాభక్తి**

పరమేశ్వరుని యందు ప్రగాఢమైన ప్రేమను, ఆసక్తిని కలిగి ఉండటమే భక్తి. ***సా పరానురక్తి రీశ్వరే*** - పరమేశ్వరుని యందు దృఢమైన ప్రేమానురక్తి కలిగి ఉండటమే భక్తి అని శాండిల్య మహర్షి భక్తిసూత్ర ప్రబోధము.

భగవంతుని కన్నా వేరుగా మరొక దానిపై ఆసక్తి ఉంటే, అది భక్తి విషయంలో విఘ్న కారక మౌతుంది. కనుక, పరమేశ్వరుని కన్నా అన్యమైన వన్నీ ఎలా అనిత్యాలో విశ్లేషించుకొని, పొందదగిన వాడు పరమేశ్వరు డొక్కడే అని నిర్ణయించుకొని, అందుకు ఏకైక సాధన మైన భక్తినే పొందాలి ***(తదేవ సాధ్యతామ్)*** అనే దృఢ నిశ్చయంతో భక్తి చేయాలి. భక్తులు పరమేశ్వరుని యందు స్థిరమైన ప్రియత్వాన్ని కలిగి ఉంటారు కనుక, విఘ్న పాలకుల శిరస్సుల మీద పాదం మోపి చరిస్తూ ఉంటారు అన్నది మహా పురాణము. అలా విఘ్నాలను, మరణాన్ని సైతం శాసించే వాడు యోగి. భక్తుడైన యోగి. చిత్త నైశ్చల్యము, పరాభక్తి కలిగిన పరమయోగి.

***తథా న తే మాధవ తావకాః క్వచిద్భ్రశ్యన్తి మార్గాత్త్వయి బద్ధ సౌహృదాః।***
***త్వయాఽభి గుప్తా విచరన్తి నిర్భయా వినాయకానీ కపమూర్ధసు ప్రభో॥***

'ప్రభో! మాధవా! నీ భక్తులకు నీ యందు ప్రియత్వము స్థిర మైనది. కనుక, నీ భక్తులు దారి తప్పి భ్రష్టులు కారు. వాళ్ళకు నీవే రక్షకుడవు కనుక, విఘ్నాలను పాలించే వారి శిరస్సుల మీద నిర్భయంగా తిరుగుతూ ఉంటారు' అని భక్తుల వైభవాన్ని మహాపురాణం దివ్యంగా వర్ణించింది.

**యోగబలం - ప్రాణావేశ్యం**

నిశ్చలమైన చిత్తము, అచంచల మైన భక్తి కలిగి ఉన్నప్పటికి, దారుణమైన మరణకాలంలో బుద్ధి విచలిత మయ్యే ప్రమాదాన్ని నిరాకరించ లేము. అలాంటి క్లిష్ట సమయంలో కాలు జారిన వాడు, గోడనో లేదా స్తంభమునో పట్టుకొని, దాని సహాయంతో పడకుండా నిలిచినట్లు, మరణ సమయంలో యోగి యోగబలం చేత నిలబడాలి.

యోగబలం చేత స్థిరత్వమును పొందిన యోగి, ప్రాణాన్ని భ్రూమధ్యంలో నిలుపుతాడు. అంటే, విషయాంతర వృత్తి నిరోధము చేత చిత్తమును అంతర్ముఖం చేసి పరమేశ్వరుని యందే స్థిరంగా నిలపడం. దీనినే ధారణగా అభివర్ణించింది యోగ శాస్త్రము.

***సూ॥ దేశ బన్ధ చిత్తస్య ధారణా*** - చిత్తమును ***(చిత్తస్య)*** ప్రదేశము నందు నిలపడం ***(దేశ బన్ధః)*** ధారణ ***(ధారణా)*** అని పతంజలి యోగదర్శనము - విభూతి పాదము.

ధారణకు ఇక్కడ భ్రూమధ్య ప్రదేశము సూచింప బడింది. హృదయ పద్మము నందు, నాసికాగ్రము నందు, జిహ్వాగ్రము నందు - ఇలా అనేక ప్రదేశాలలో నిలపడం వ్యవహారంలో ఉంది. గీతాచార్యుడు ప్రత్యేకించి ధారణ ప్రదేశంగా భ్రూమధ్యాన్ని సూచించాడు. మనకు ఏదైనా స్మృతికి రానపుడు చూపుడు వేలును, బొటన వేలును భ్రూమధ్యం మీద ఉంచి నొక్కుతాము. ధారణకు అది అనువైన ప్రదేశము కావడమే అలా నొక్కడం లోని ఉద్దేశ్యము.

హృదయము నుండి బహిర్గత మయ్యే ఇడ - పింగళ నాడులను నిరోధించి, హృదయము నుండి ఊర్ధ్వంగా పయనించే సుషుమ్న నాడి ద్వారా హృదయం లోని ప్రాణాన్ని కంఠం వద్దకు చేర్చి, అక్కడ వ్రేలాడుతున్న చిరునాలుక గుండా భ్రూమధ్యమునకు చేర్చి అంటే, కనుబొమ్మల మధ్య స్థిరంగా ఉంచి ***(సమ్యక్ స్థాపయిత్వా)***, ఆ తరువాత ఊర్ధ్వంగా పయనింప చేసి బ్రహ్మరంధ్రము ద్వారా నిష్క్రమించి, యోగి దివ్యమైన పరమ పురుషుణ్ణి పొందుతాడు. ఇది యోగి యొక్క పరమ నిర్యాణము.

భీష్ముడు కూడా ప్రాణ సంచారాన్ని నిరోధించి, మరణాన్ని తన అదుపులో ఉంచుకున్నాడు. కృష్ణా! ఈ కళేబరాన్ని త్యజించడానికి నాకు అజ్ఞ ఇవ్వు ***(అనుజానీ హి మాం కృష్ణ మోక్ష్యే కలేవరమ్)***. నీ ఆజ్ఞతో ఈ దేహాన్ని త్యజించి పరమగతిని పొందుతాను ***(త్వయాఽహం సమనుజ్ఞాతో గచ్ఛేయం పరమాం గతిమ్)*** అన్నాడు భీష్ముడు. అలాగే స్వచ్ఛందంగా ప్రాణాన్ని విడిచి పెట్టేశాడు. ఇదే స్వచ్ఛంద మరణం. ఉత్తమ యోగి పుంగవులకే సాధ్యం.

శ్వాసను లోనికి తీసుకున్న తరువాత, తిరిగి దానిని బహిర్గతం చేయకుండా లోపలే నిలిపి, హృదయంలో పూరింపబడిన ప్రాణాన్ని సుషుమ్న నాడి ద్వారా ఊర్ధ్వంగా కంఠ ప్రదేశానికి నడిపి, అక్కడ నుండి ఉన్నతంగా పంపి, భ్రూమధ్యంలో స్థిరంగా నిలిపి, ఆ తరువాత సహస్రారం నుండి, అంటే బ్రహ్మరంధ్రం ద్వారా నిష్క్రమింప చేయడం స్వచ్ఛంద మరణం. యోగి ప్రాణాన్ని ఇలా త్యజిస్తాడు. అలా త్యజించిన వాడు పరమగతిని పొందుతాడు. ***యోగేన అంతే తనుత్యజామ్*** - చివరగా యోగబలం చేత దేహాన్ని చాలించాలి అన్నాడు రఘు వంశంలో కాళిదాసు.

ఇక్కడ ప్రాణ శబ్దానికి అర్థం చిత్త మని, దృష్టి అని కొందరు గ్రహిస్తారు. అలా గ్రహించిన వారు భ్రూమధ్యంలో ధారణ చేయడ మంటే, దృష్టి నిలపడ మని, మనస్సును స్థిరపరచడ మని భావిస్తారు.

*దివ్యమైన పరమ పదము ఎలాంటిదో చెబుతున్నాడు.*

**య దక్షరం వేదవిదో వదన్తి విశన్తి య ద్యతయో వీతరాగాః ।**
**య దిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే ॥ 11**

***యత్-అక్షరం-వేదవిదః-వదంతి-విశంతి-యత్-యతయః-వీతరాగాః***

***యత్-ఇచ్ఛంతః-బ్రహ్మచర్యం-చరంతి-తత్-తే-పదం-సంగ్రహేణ-ప్రవక్ష్యే***

| | | | |
|---|---|---|---|
| వేదవిదః | = వేదవేత్తలు | ఇచ్ఛంతః | = కోరుతూ |
| యత్ | = దేనిని | బ్రహ్మచర్యం | = బ్రహ్మచర్యమును |
| అక్షరం | = అక్షరమని | చరంతి | = అవలంబిస్తున్నారో |
| వదంతి | = చెబుతున్నారో | తత్ | = అట్టి |
| వీత రాగాః | = రాగమును విడిచిన | పదం | = స్థానమును |
| యతయః | = యతులు | తే | = నీ కొరకు |
| యత్ | = దేనిని | సంగ్రహేణ | = సంగ్రహముగ |
| విశంతి | = చేరుతున్నారో | ప్రవక్ష్యే | = వివరంగా చెబుతున్నాను |
| యత్ | = దేనిని | | |

**అర్జునా! పరమపదం ఏమిటో నీకు సంగ్రహంగా చెబుతాను. వేదవిదులు దానిని అక్షరం అంటారు. రాగరహితులైన యతి పురుషులు దాని లోనే ప్రవేశిస్తారు. దానిని ఆశించే బ్రహ్మచర్యాన్ని పాటిస్తూ ఉంటారు.**





**వ్యాఖ్య**

మరణాన్ని ఎలా మంగళకరంగా మార్చుకోవాలో ఇంతవరకు వివరించిన వాసుదేవుడు, ప్రతీక మనే ఉపాయంతో ఇక వివరించ బోతున్నాడు. బ్రహ్మవాచక మైన ఓంకారమువే ఇక్కడ ప్రతీకంగా ఉపదేశిస్తున్నాడు.

**అక్షర స్వరూపము**

ధ్యాన సమయాన ఏదో ఒక నామము చేత పరమేశ్వరుని అనుస్మరించడం జరగాలి కనుక, అట్టి అభిధానము శ్రుతి ప్రతిపాదిత మైన ఓంకారమే అని ప్రమాణమును ప్రదర్శిస్తున్నాడు.

వేదార్థ జ్ఞానము నెరిగిన వేదవేత్తలు ఓంకారమును అక్షరంగా వర్ణించారు ***(న క్షరతి ఇతి అక్షరం అవినాశి)***. నాశరహిత మైన ఓంకారమును బ్రహ్మముగా అభివర్ణించారు. ఈ విషయాన్ని బృహదారణ్యక శ్రుతి ప్రతిపాదించింది.

***తద్వా ఏతదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదన్తి*** - ఓ గార్గీ! అట్టి బ్రహ్మమునే బ్రహ్మవిదులు అక్షరం అంటున్నారు. ***అస్థూలం అనణు*** - అది స్థూలము కాదు, సూక్ష్మమూ కాదంటూ సమస్త విశేషములను నిషేధించి, యాజ్ఞవల్క్యాది మహర్షులు బ్రహ్మమును నిరూపించడం జరిగింది.

కాలంలో నశించేవి ఏవైనా క్షరములే. కాలములో నశించనిది, కాలాతీతము కాలాధారము అయిన చైతన్యమే ఇక్కడ ఓంకారముగా తెలుస్తూ ఉంది. ఇది తెలియదగిందే గాని అనుభవించ దగింది కాదు. ఇదే అక్షర ధ్యానము. అక్షరాభ్యాసము.

బిడ్డల విద్యాభ్యాసమును అక్షరాభ్యాసముతో ఆరంభించడం ఆర్ష సంప్రదాయము. ముందుగా ఓంకారమును వ్రాయించి, ఆ తరువాత పరమేశ్వరుని అనుగ్రహమును అర్థిస్తూ పంచాక్షరిని వ్రాయిస్తారు. సమస్త విద్యలు ఓంకారము నందే ఉన్నందున, బ్రహ్మవాచక మైన ఓంకారమును అక్షరాభ్యాస కాలంలో ప్రథమంగా వ్రాయిస్తారు. ఈ విధంగా వ్రాసిన ఓంకారము యొక్క పూర్ణత్వాన్ని విద్యా స్వరూపంగా జ్ఞానులై గ్రహిస్తారు.

**జ్ఞాన ప్రాప్తము**

పరమ వైరాగ్యవంతు లైన యతిపురుషులు అక్షర రూపమైన ఈ పరబ్రహ్మము నందే ప్రవేశిస్తున్నారు ***(విశన్తి)*** అంటున్నాడు.

ఏ విషయము నందు మనకు ఆసక్తి ఉంటుందో, దాని యందు రాగం ఉదయిస్తుంది. రాగ వృత్తుల చేత సంస్కారాలు కలుగుతూ ఉంటాయి. ఈ సంస్కారాలు తిరిగి రాగవృత్తులను కదిలిస్తూ ఉంటాయి. ఈ వృత్తి సంస్కార చక్రము పరిభ్రమిస్తూ ఉన్నంత కాలం సంసార చక్రము తిరుగుతూనే ఉంటుంది.

రాగ రహితమైన చిత్తము శుద్ధిపడి ఉంటుంది. శుద్ధి పడిన చిత్తము గల యతులు ప్రయత్నశీలురై జ్ఞానమును పొందుతారు. ఇలా జ్ఞానమును పొందటమే ప్రవేశించుట ***(విశన్తి)*** అనే పదానికి అర్థము ***(యచ్ఛ అక్షరం ఇచ్ఛన్తః జ్ఞాతుమ్ ఇతి వాక్య శేషః)***. కనుక ప్రవేశించడము అంటే జ్ఞానమును పొందుటయే గాని, ఎలుక కన్నము లోనికో, సింహము గుహ లోనికో ప్రవేశించినట్లు ప్రవేశించుట కాదు.

**బ్రహ్మచర్యము**

అక్షర స్వరూపమైన బ్రహ్మమును ఆశించియే సాధకులు బ్రహ్మచర్య వ్రతమును ఆచరిస్తారు. బ్రహ్మము అనే విషయము నందు చరించడమే బ్రహ్మచర్యము. అంటే, బ్రహ్మజ్ఞానము కొరకు గురుసన్నిధిలో శ్రవణ మనన నిదిధ్యాసనలను సాగించడము బ్రహ్మచర్యము అవుతుంది.

వీర్యశక్తిని పరిరక్షించుకోవడము కూడా బ్రహ్మచర్యమే. *బ్రహ్మచర్య ప్రతిష్ఠాయాం వీర్యలాభః* - బ్రహ్మచర్యము స్థిరపడి నపుడు వీర్యలాభం ప్రాప్తిస్తుందని పతంజలి మహర్షి యోగదర్శనం - సాధన పాదంలో సూత్రీకరించారు. వీర్య సామర్థ్యము చేత జ్ఞాన క్రియా శక్తులలో సాధకుడు ప్రతిభావంతు డవుతాడు. అంతే కాదు. బ్రహ్మచర్య ప్రభావము చేత తాను జ్ఞానవంతుడు కావడమే గాక, తనను ఆశ్రయించు సాధకులకు జ్ఞానమును ఉపదేశించే సామర్థ్యమును కూడా పొందుతాడు అని ఈ సూత్రంపై వ్యాస భాష్యము.

దేనిని వేదవిదులు అక్షరం అన్నారో, వైరాగ్యవంతులైన యతులు దేనిని పొందుతారో, దేని నాశించి సాధకులు బ్రహ్మచర్యమును పాటిస్తూ ఉన్నారో అది ఓంకార మనే పదము అంటున్నాడు. ఏది పొంద బడుతుందో దానిని పదం అంటారు *(పదం పదనీయం).* అంటే జ్ఞానము చేత పొందబడేది అని అర్థం *(పద్యతే ప్రాప్యత ఇతి పదం).* అది ఏదో కాదు, ఓంకారమే. దీనికి ప్రామాణికత్వం సిద్ధించి ఉంది. ముఖ్యంగా, ప్రస్తుత శ్లోకం పూర్వార్థం బృహదారణ్యక శ్రుతిలో యాజ్ఞవల్క్యుడు గార్గికి బోధించినది కాగా, ఉత్తరార్థం కఠోపనిషత్తులో యమాచార్యులు నచికేతునికి చేసిన ఉపదేశము. ఈ శ్లోకమును యథావిధిగా నచికేతునికి వివరించడం కూడా జరిగింది.

*సర్వే వేదా యత్పద మామనన్తి తపాంసి సర్వాణి చ యద్వదన్తి ।*
*యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరన్తి తత్తేపదం సంగ్రహేణ బ్రవీమి ఓమిత్యేతత్ ॥*

వేదము లన్నీ దేనిని పొందదగిన పదముగా వర్ణించాయో, దేనిని ఆశించి తపస్సు మొదలైన సాధనలు ఆచరింప బడుతున్నాయో, దేనిని పొందే ప్రయత్నంలో బ్రహ్మచర్యమును అనుష్ఠించడం జరుగుతూ ఉందో, ఆదే ఓంకారము అనే పదము. దానినే నీకు సంక్షేపంగా చెబుతాను అన్నాడు యమాచార్యుడు. అదే చెబుతున్నాడు గీతాచార్యుడు.

భగవంతుడు సంగ్రహంగా చెబుతాను అనగానే, విషయం పాక్షిక మేమో అనే సంశయాన్ని నివారిస్తూ, చెబుతాను *(వక్ష్యామి)* అనకుండా విశేషంగా చెబుతాను *(ప్రవక్ష్యామి)* అంటున్నాడు.

*ప్రణవ ధ్యాన పద్ధతిని వివరించ బోతున్నాడు.*

**సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ ।**
**మూర్ధ్న్యా ధాయాత్మనః ప్రాణ మాస్థితో యోగధారణామ్ ॥** 12

*సర్వద్వారాణి-సంయమ్య-మనః-హృది-నిరుధ్య-చ*
*మూర్ధ్ని-ఆధాయ-ఆత్మనః-ప్రాణం-ఆస్థితః-యోగధారణాం*

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆత్మనః | = | తన యొక్క | మూర్ధ్ని | = | శిరస్సు నందు |
| సర్వద్వారాణి | = | సమస్త ఇంద్రియ ద్వారములను | ప్రాణం | = | ప్రాణమును |
| సంయమ్య | = | నియమించి | ఆధాయ | = | ఉంచి |
| మనః | = | మనస్సును | యోగధారణాం | = | యోగాభ్యాసమున |
| హృది | = | హృదయము నందు | ఆస్థితః | = | ఉన్నవాడై |
| నిరుధ్య చ | = | నిలిపి | | | |

**ఇంద్రియ ద్వారా లన్నీ మూసేస్తాడు. మనస్సును హృదయంలో నిలుపుతాడు. ప్రాణాన్ని శిరస్సులో ఉంచుతాడు. యోగధారణను అవలంబిస్తాడు.**





**వ్యాఖ్య**

నీకు తెలిసింది ఏదో అదే నీ ప్రపంచము. నాకు తెలిసింది ఏదో అదే నా ప్రపంచం. నాకు తెలిసిన దాని కన్నా వేరుగా ప్రపంచం ఉంటే ఉండొచ్చు. కాని, ఆ ప్రపంచం నా మటుకు నాకు లేనిదే. నాకు తెలిసిందే నా ప్రపంచము. నాకు ఏది తెలిసినా నా ఇంద్రియ మనస్సుల ద్వారా తెలియ వలసిందే గాని మరొక విధంగా తెలిసే అవకాశము లేదు. బయట ఏది ఉన్నా అది నా మనస్సులో ఆలోచన గానే తెలుస్తూ ఉంది.

కుండ ఉంది అన్నప్పుడు, ఆ కుండ యొక్క వృత్తికి సంబంధించిన విషయం ఎక్కడుంది? కుండ లోనే ఉంది. కుండ నుండి వృత్తిని వేరు చేస్తే, కుండ అనే భావన మనస్సులో ఉండే అవకాశమే లేదు.

**మూతబడిన ద్వారాలు**

రూపానికి సంబంధించిన విషయం కన్ను ద్వారా లోనికి ప్రవేశించి నపుడు, అది మనస్సును చేరి కలవర పరుస్తూ ఉంది. శబ్దానికి సంబంధించిన విషయం చెవి ద్వారా, వాసనకు సంబంధించిన విషయం ముక్కు ద్వారా - ఇలా స్వవిషయాలైన శబ్దాది విషయాలను శ్రోత్రాది ఇంద్రియాలు మనస్సుకు చేరవేస్తూ ఉంటాయి. విషయాలు మనస్సు లోకి ప్రవేశించ డానికి జ్ఞానేంద్రియాలే ద్వారాలై ఉన్నాయి.

గృహ ద్వారాలను మూయగానే ఇంటి లోకి ప్రవేశము నిరోధింప బడినట్లు, ఇంద్రియ ద్వారాలను మూయగానే బాహ్య విషయాలు మనస్సు లోనికి ప్రవేశించకుండా అడ్డగింప బడుతాయి. విషయాలు లోనికి ప్రవేశించలేక పోయినా, మనస్సు తన సహజ స్వభావము చేత తనకు తానుగా బహిర్గతం కావచ్చు. కాని, సమస్త ఇంద్రియ ద్వారాలను మూసి వేయడం చేత, ఇంద్రియాలు సంయమనం చేయబడ్డాయి కనుక *(సర్వాణి ఇంద్రియ ద్వారాణి సంయమ్య సంయమనం కృత్వా)* బాహ్య విషయాలు లోనికి ఎలా ప్రవేశించ లేవో, మనస్సు కూడా మూయబడిన ఇంద్రియాల ద్వారా బహిర్గతం కాలేదు.

ధ్యానకాలంలో ఇంద్రియాలు స్వవిషయాల నుండి విడిపడి ఉంటాయి కనుక, అవి విషయాకారమును పొందలేక చిత్తాకారమునే పొందుతాయి. చిత్తము నందే అణగి ఉంటాయి.

శబ్దాది విషయాల యందు ఆసక్తి లేనపుడు ఇంద్రియాలు ఉపశమిస్తాయి. అంతమాత్రాన దానిని ఇంద్రియ సంయమనముగా భావించ లేము. ఎందుచేత నంటే, ఆసక్తికర మైన విషయాలు ప్రాప్తించి నపుడు ఇంద్రియాలు తిరిగి విజృంభిస్తాయి. అలా జరిగి నపుడు, ఇవి శాస్త్ర నిషిద్ధములు కావు అని కొందరు, ఇంద్రియాలను తమ అదుపులో ఉంచుకొని అనుభవించడం చేత నియమింప బడతాయి అని మరి కొందరు, రాగద్వేషాలను తటస్థపరచి విషయాలను అనుభవిస్తే, తద్వారా సుఖదుఃఖాలు కలిగే అవకాశం లేనందున అది కూడా ఇంద్రియ నియమమే అని ఇంక కొందరు - ఇలా ఎన్నో విధాలుగా ఇంద్రియ నిగ్రహాన్ని ఊహిస్తూ ఉంటారు. కాని, ఇవన్నీ ఏదో ఓ క్షణాన బ్రతుకునే తారుమారు చెయ్యవచ్చు. కనుక, ఇంద్రియ విషయాల లోని దోషమును దర్శించే అభ్యాసమే ఇంద్రియ నియమానికి రాజమార్గము. అభ్యాస వైరాగ్యాదులే మనోనియమానికి, లేదా సంయమనానికి సరియైన సాధన లని ఆరవ అధ్యాయం లోనే భగవంతుడు స్పష్టం చేశాడు.

**ఆగిన సంకల్ప సంచారము**

ఇంద్రియ ద్వారాలు మూత పడటం చేత శబ్దాది విషయాలు లోనికి ప్రవేశించవు. అలాగే మనస్సు బహిర్ముఖమై విషయాలను చేరలేదు. అంతమాత్రాన మనోవ్యాపారం ఆగినట్లేనా? సంకల్ప సంచారము

నిరోధింప బడినట్లేనా? ఇంద్రియ ద్వారాలు మూత బడినా, మనస్సు తన ఊహాలలో ఊరేగే ప్రమాదం తేక పోలేదు. అందుచేత మనస్సు లోని సంకల్పాలను కూడా నిరోధించి, మనస్సును హృదయంలో నిలపాలి *(మనః హృదయ పుండరీకే నిరుధ్య నిరోధం కృత్వా, నిష్ప్రచారం ఆపాద్య).*

హృదయము అంటే గుండె అని కాదు. వృత్తి మూల స్థానము అని అర్థం. వృత్తులు ఎక్కడ నుండి ఉద్భవిస్తాయో, తిరిగి ఎక్కడ లయించి పోతాయో అట్టి సర్వ వృత్తి మూలస్థానమే హృదయము. అదే అహంవృత్తి స్థానము. అహంవృత్తికి ఆధార మైనదే హృదయము. అది వృత్తి రహిత చైతన్యము.

వృత్తు లన్నీ చైతన్యము కన్నా భిన్నం కావు. సర్వ వృత్తులకు ఆశ్రయ స్థానము చైతన్యమే. వృత్తి కూడా చైతన్యమే. కాని చైతన్యం వృత్తి కాదు. చైతన్య కాంతిపుంజ మైన వృత్తికి తాను చైతన్యమే అయినా, ఆ స్ఫురణ లేని కారణంగా తాను పరిమిత మన్న భావన ఉంది. ఈ కారణం చేత విషయాలు లోనికి ప్రవేశించకుండా, మనస్సు బహిర్గతం కాకుండా ఇంద్రియ ద్వారాలను మూసినా కూడా మనస్సు యొక్క సంకల్ప సంచారము ఆగదు. కనుక మనస్సును దాని పట్టు స్థానం వైపుకు మరలించాలి. అది కూడా సరిపోదు. ఆ చైతన్య స్థానము, లేదా వృత్తి మూల స్థానము తానే అన్న జ్ఞానాన్ని దానికి కలిగించాలి. అదే జ్ఞాన నిష్ఠ. కాని, ఇది జ్ఞాన విషయం కాదు. కనుక, ఇక్కడ యోగనిష్ఠ ప్రతిపాదింప బడుతూ ఉంది.  ప్రాణ నిరోధము చెప్పబడుతూ ఉంది. అదే యోగధారణము.

**ప్రాణ బంధనము**

ఇంద్రియ మనోద్వారాలను మూసి వేసిన తరువాత ప్రాణ ద్వారాన్ని కూడా మూసి వేయాలి. అంటే ప్రాణాన్ని కూడా నిరోధించి, సుషుమ్న నాడీ మార్గము ద్వారా ప్రాణమును కంఠ భ్రూమధ్య లలాట క్రమంలో నడిపించి యోగ ధారణం చేయాలి. ఇక్కడ బ్రహ్మ వాచక మైన ఓంకారమును *(తస్య వాచకః ప్రణవః),* ఓంకారము యొక్క అర్థ మగు బ్రహ్మమును స్మరిస్తూ మోక్షాన్ని పొందడం జరుగుతుంది.

*ఈ ఓంకార రూపమైన అక్షర ధ్యానమును ఇక చెబుతాడు.*

**ఓ మి త్యేకాక్షరం బ్రహ్మ వ్యాహర న్మామనుస్మరన్ ।**
**యః ప్రయాతి త్యజ న్దేహం స యాతి పరమాం గతిమ్ ॥** 13

***ఓం-ఇతి-ఏకాక్షరం-బ్రహ్మ-వ్యాహరన్-మాం-అనుస్మరన్***

***యః-ప్రయాతి-త్యజన్-దేహం-సః-యాతి-పరమాం-గతిం***

| | | | | | |
|---|---|---|---|---|---|
| బ్రహ్మ | = | పరబ్రహ్మ | త్యజన్ | = | త్యజించి |
| ఓం ఇతి | = | ఓం అనెడి | యః | = | ఎవడు |
| ఏకాక్షరం | = | ఏకాక్షరమును | ప్రయాతి | = | పోతున్నాడో |
| వ్యాహరన్ | = | పలుకుతూ | సః | = | అతడు |
| మాం | = | నన్ను | పరమాం | = | ఉత్తమమైన |
| అనుస్మరన్ | = | స్మరిస్తూ | గతిం | = | స్థానమును |
| దేహం | = | దేహమును | యాతి | = | పొందుతాడు |

**అర్జునా! బ్రహ్మ వాచకమైన ఓంకారాన్ని ఉచ్చరిస్తూ, నన్నే స్మరిస్తూ దేహాన్ని విడిచి పెట్టిన వాడు ఉత్తమ గతిని పొందుతాడు.**





**వ్యాఖ్య**

**ఏకాక్షరం**

ఓంకారము యొక్క అర్థము బ్రహ్మము. బ్రహ్మము యొక్క పేరు ఓంకారము. బ్రహ్మము ఏకాక్షరం. ఏకాక్షరం అంటే ఏకము, 'అ'కార స్వరూపము అని అర్థము. అలాగే ఓంకారము ఏకాక్షరం. అంటే 'ఓం' అనే ఒకే అక్షరము కలది అని అర్థము.

బ్రహ్మము యొక్క పేరే ఓంకారము ***(బ్రహ్మణః అభిధానభూతమ్ ఓంకారమ్).*** బ్రహ్మము వాచ్యము. ఓంకారము వాచకము. ఏకాక్షర స్వరూపమైన బ్రహ్మమునకు, ఏకాక్షర రూపమైన ఓంకారమునకు వాచ్యవాచక సంబంధము, లేదా అభిధేయ అభిధాన సంబంధము ప్రాప్తము.

***తస్య వాచకః ప్రణవః*** ఓంకారము ***(ప్రణవః)*** బ్రహ్మమునకు ***(తస్య)*** పేరు ***(వాచకః)*** అని పతంజలి మహర్షి నిర్వచించాడు. అంటే బ్రహ్మమును తెలియ చేసేది ప్రణవము లేదా ఓంకారము. అది వాచకము. వాచకము ద్వారా, అంటే ఓంకారము ద్వారా తెలియ బడేది అయినందున బ్రహ్మము వాచ్యము.

కంటికి కనిపించని వ్యక్తిని పేరు పెట్టి పిలిస్తే, 'ఓ' యని పలికి తన ఉనికిని తెలియ జేస్తాడు. పరమేశ్వరుడు కూడా కంటికి అగోచరుడు కనుక, అతనికి అభిధాన మైన ఓంకారముతో పిలిస్తే తప్పక తెలిపి వస్తాడు. ఈ విషయాన్ని స్మృతి కూడా ధృవపరచింది.

*అదృష్ట విగ్రహో దేవో భావగ్రాహ్యో మనోమయః ।*
*తస్యోంకారః స్మృతో నామ తేనాహూతః ప్రసీదతి ॥*

భగవంతుని యొక్క శరీరము ***(విగ్రహః)*** అదృష్టము. అంటే కంటికి కనిపించనిది. కంటికి కనిపించని దేవుడు మనస్సు చేత అనగా భావము ద్వారా గ్రహింప బడతాడు. భగవంతునికి ఓంకారము అని పేరు. అట్టి ఓంకారముతో పిలిస్తే భగవంతుడు ప్రసన్ను డవుతాడు.

మరణ సమయాన బ్రహ్మ అభిధాన మైన ఓంకారమును ఉచ్చరించి ***(వ్యాహరన్ ఉచ్చారయన్),*** ఓంకారము యొక్క అర్థమైన పరమేశ్వరుని అనుస్మరించి ***(ఈశ్వరమ్ అనుస్మరన్ అనుచిన్తయన్)*** దేహమును విడిచి వెళ్ళే జీవుడు ***(యః ప్రయాతి సః త్యజన్ పరిత్యజన్, దేహం శరీరం)*** ఉత్కృష్ట మైన గతిని, అనగా మోక్షమును పొందుతాడు ***(సః పరమాం ప్రకృష్టాం గతిం ప్రయాతి)*** అంటున్నాడు భగవంతుడు.

**శబ్దార్థ వైభవము**

ఓంకారమును ఉచ్చరించాలి.. అలాగే ఓంకారము యొక్క అర్థమైన పరమేశ్వరుని అనుస్మరించాలి. 'ఓం' అనే శబ్దము బ్రహ్మమును గూర్చి చెబుతుంది. అలా చూచి నపుడు బ్రహ్మము, బ్రహ్మజ్ఞానము రెండూ ఒకటే కనుక, ఓంకారము బ్రహ్మ స్వరూపమే అవుతుంది. ప్రణవోపాసనము బ్రహ్మోపాసనమే అవుతుంది.

విగ్రహమును, లేదా ప్రతిమను పరమేశ్వరుడిగా భావించి ఆరాధించి నపుడు, పరమేశ్వరుణ్ణి ప్రతిమ మీద ఆరోపించి పూజిస్తున్నాం కదా! ప్రతిమ అనేది రూపము. ప్రతీకము అనేది శబ్దము. రూపము నందు ఎలాగైతే పరమేశ్వరుని ఆరోపించి అర్చిస్తున్నామో, అలాగే 'ఓం' అనే శబ్దమును బ్రహ్మముగా ఉపాసిస్తున్నాము. ఇదే ప్రతీకోపాసన. ఓంకారము బ్రహ్మమునకు ప్రతీక మైంది. ప్రణవము శబ్దబ్రహ్మ మైంది.

ప్రతిమలో విష్ణుమూర్తిని ఆరోపించి నపుడు ఆ ప్రతిమ విష్ణువునే సూచిస్తూ ఉంది అనే భావన మనకు ఉంది. ఓంకారము కూడా అంతే. 'ఓం' అని ఉచ్చరించి నపుడు అది 'అపరబ్రహ్మ'గా తెలుస్తూ ఉంది.

అదే ఓంకారమును అర్థయుక్తంగా ఉచ్చరించి నపుడు అది 'పరబ్రహ్మ' అవుతూ ఉంది. ఓంకారమును ఉచ్చరిస్తూ దాని అర్థమైన పరమేశ్వరుని కూడా స్మరించాలి అని భగవంతుడు ప్రస్తుత శ్లోకంలో చెప్పడం వెనుక అంతర్భావం ఇదే. ఈ విధంగా ప్రణవ జపము అర్థ భావ స్మరణతో కలిసి మోక్ష హేతువు అవుతూ ఉంది. ఈ విషయాన్ని పతంజలి మహర్షి తన యోగదర్శనంలో విస్పష్టం చేశాడు.

**తజ్జప స్తదర్థ భావనమ్** - ఓంకారమును జపించుట **(తజ్జపః)**, ఓంకారము యొక్క అర్థమైన బ్రహ్మమును భావన చేయుట **(తదర్థ భావనమ్)** అనే జపధ్యానాదుల ద్వారా పరమాత్మ సాక్షాత్కారము సంప్రాప్త మవుతుంది అన్నాడు.

**తారక మంత్ర జపము**

ఓంకారము సర్వమంత్ర స్వరూపము. వేదసారము. సర్వమంత్రాలలో ప్రణవమే ఉత్తమ మైనది. అట్టి ఓంకార జపమును భావార్థ సహితంగా సాగించి ధ్యానించు వారు సంసార బంధము నుండి విడిపడి ఉత్తమ గతి యైన మోక్షమును పొందుతారు.

***ఓంకార స్సర్వమన్త్రాణాం ఉత్తమః పరికీర్తితః ।***
***ఓంకారేణ ప్లవేనైవ సంసారాబ్ధిం తరిష్యతి ॥***

సమస్త మంత్రాలలో ఓంకారమే ఉత్తమమైన దని ఋషులు కీర్తించారు. సంసార సాగరాన్ని దాటడానికి ఓంకార మనే నావకు మించినది మరొకటి లేదు. అందుచేత ప్రణవం కూడా తారక మంత్రమే.

మరణ సమయంలో ఓంకారమును జపిస్తూ దాని అర్థమైన ఈశ్వరుని స్మరిస్తూ యోగి దేహాన్ని త్యజించి వెళ్తున్నాడు **(యః ప్రయాతి త్యజన్ దేహం)**. దేహాన్ని త్యజించి వెళ్తున్నాడు అని ప్రయాణ విశేషాన్ని చెప్పడం చేత, మరణం అనేది దేహానికే గాని, దేహాన్ని విడిచిపెట్టి వెళ్ళే జీవునికి కాదు అనేది స్పష్టమైంది. అలా వెళ్ళే వాడు ఉత్తమ గతిని పొందుతాడు. ముందుగానే మనం చెప్పుకున్నట్లు ఈ విధమైన యాత్ర యోగ సంబంధ మైనదే అగుట చేత, ఈ విధమైన ముక్తి క్రమముక్తియే గాని జీవన్ముక్తి కాదు అనేది గ్రహించాలి.

జీవన్ముక్తుడు దేహాన్ని త్యజించి బ్రహ్మప్రాప్తిని పొందుతాడు. కనుక అతడు జీవుడుగా పయనించడ మనేది ఉండదు. కాని ఇది యోగి ప్రయాణం. దేహాన్ని త్యజించిన యోగి బ్రహ్మ లోకానికి పయన మవుతాడు. అక్కడ బ్రహ్మదేవుని చెంత ఆసీనుడై శాస్త్రాన్ని శ్రవణం చేసి అక్కడ నుండి మోక్షాన్ని పొందుతాడు. ఇదే క్రమముక్తి.

*అట్టి స్థితిని పొందాలి అంటే, అన్యచింతలను మాని పరమేశ్వరునే స్మరించాలి. అట్టి వారికి పరమేశ్వరుడు సులభసాధ్యుడు. ఎలాగో, వినండి.*

**అనన్యచేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః ।** 14
**త స్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః ॥**

***అనన్యచేతాః-సతతం-యః-మాం-స్మరతి-నిత్యశః***
***తస్య-అహం-సులభః-పార్థ-నిత్యయుక్తస్య-యోగినః***

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ | = | అర్జునా | సతతం | = | సదా |
| యః | = | ఎవడు | నిత్యశః | = | అనుదినము |
| అనన్యచేతా | = | అనన్య చిత్తముతో | మాం | = | నన్ను |





| | | | | | |
|---|---|---|---|---|---|
| స్మరతి | = | స్మరిస్తున్నాడో | అహం | = | నేను |
| నిత్యయుక్తస్య | = | నిత్యయుక్తు డైన | సులభః | = | సులభంగా లభ్య మవుతాను |
| తస్య యోగినః | = | ఆ యోగికి | | | |

**అర్జునా! నన్ను పొందటానికి సులభమైన ఉపాయం చెబుతున్నా, విను. మనస్సులో మరొక ధ్యాస ఉండ కూడదు. నిరంతరం నన్నే స్మరించాలి. నిత్యం యోగనిష్ఠలో ఉండాలి. అట్టి భక్తుడు నన్ను సులభంగా పొందుతాడు.**

**వ్యాఖ్య**

మనస్సుకు దేని యందు ఆసక్తి ఉంటుందో, దాని యందే అది లగ్నమై ఉంటుంది. కొందరికి అనిత్యము లైన విషయాల యందే ఆసక్తి ఉంటుంది. అట్టి వారి మనస్సు ప్రపంచము లోనే పరిభ్రమిస్తూ ఉంటుంది. వీరు అన్య చేతస్సులు. అంటే అనేకము లైన విషయాల యందు మనస్సును ఉంచేవారు.

కొందరు నిత్యానిత్యాలను రెండిటినీ ఆశిస్తారు. అలాంటి వారు రెండిటి యందు ఆసక్తిని కలిగి ఉంటారు. వారికి ప్రాపంచిక విషయాలు కావాలి. అలాగే పరమేశ్వరుడు కూడా కొంత కావాలి. దృశ్యము లైన భోగాలూ కావాలి. అదృశ్యంగా ఉండే భగవంతుడూ కావాలి. వీరిలో కూడా ఎక్కువ మంది అనిత్యాలు ప్రాప్తించడానికే భగవంతుని అప్పుడప్పుడు, లేదా రోజులో ఏదో ఒక సమయాన ఆరాధిస్తూ, తాత్కాలికమైన భగవదాసక్తిని కలిగి ఉంటారు. ఇలాంటి వారు అటు ఇటు కాకుండా పోతారు. దీనినే శాస్త్రంలో 'అర్ధ జరతీయ న్యాయము' అంటారు. అంటే కోడిగ్రుడ్డును రెండు భాగాలు చేసి సగ భాగమును పిల్లను పుట్టించడానికి పొదిగించి, సగ భాగమును వండుకొని తినడము అని అర్థం. ఇలాంటి ప్రయత్నాలు వ్యవహారం లోనే ఫలించవు. ఇక భగవంతుడి విషయం వేరే చెప్పాలా!

మూడవ కోవకు చెందిన వారు అనన్య చేతస్సులు. వీరికి ఒక్క పరమేశ్వరుని యందే ప్రీతి. భగవ ద్విషయము నందే ఆసక్తి. అంతే కాదు. అనిత్య విషయాల పట్ల అనాసక్తి కూడా. పరమేశ్వరుని యందే వారు ఆసక్తిని కలిగి ఉంటారు కనుక నిత్యము పరమేశ్వరునే స్మరిస్తూ ఉంటారు. భగవంతుని విషయము నందే అనన్య చిత్తమును కలిగి ఉంటారు. పరమేశ్వరుని కన్నా అన్యమైన విషయాల యందు ఉదాసీనంగా ఉంటారు. ***తస్మిన్ అనన్యతా తద్విరోధిషు ఉదాసీనతా చ*** అని నారద భక్తిసూత్ర ప్రబోధము.

**అనన్య చిత్తులు**

ఇతర విషయాల యందు ఎవరి మనస్సు లగ్నం కాదో అట్టి మనస్సు కల వారు అనన్యచిత్తులు. అనన్య చిత్తులైన భక్తులు భగవంతుని యందే పరమాసక్తిని కలిగి ఉంటారు. ఒక పతివ్రత సదా తన భర్తనే ఎలా చింతిస్తూ ఉంటుందో **(సాధ్వీ నైజ విభుం)**, ఒక జీవనది ఎలా అఖండంగా సముద్రం వైపు ప్రవహిస్తూ ఉంటుందో **(సింధుః సరిద్వల్లభమ్)**, అలాగే అనన్య చేతస్సు లైన భక్తుల హృదయాలు పరమేశ్వరునే చింతిస్తూ, పరమేశ్వరుని వైపే పరుగులు తీస్తూ ఉంటాయి. అట్టి భక్తులు ఎల్లప్పుడు **(నిత్యశః)** నిరంతరంగా **(సతతమ్)** భగవంతున్నే స్మరిస్తూ ఉంటారు. ***సతతం, నిత్యశః*** అనే విశేషణాలు సమానార్థక పదాలుగా తెలుస్తూ ఉన్నా, పునరుక్తములు కావు. అవి పరస్పరం విలక్షణ మైన విశేషార్థాలతో శోభిస్తున్నాయి.

**సమాధి సిద్ధిః ఈశ్వర ప్రణిధానాత్** - ఈశ్వర ప్రణిధానము వల్లనే సమాధి సిద్ధిస్తుంది అని పతంజలి యోగసూత్రము. అంటే, సర్వ భావాలను పరమేశ్వరుని పైకి మళ్ళించి, సమర్పణ భావంతో జీవించే వారికి సమాధి సిద్ధిస్తుంది అని అర్థము. ఇదే ఈశ్వర ప్రణిధానము లేదా ఈశ్వర భక్తి ఫలము. అట్టి ఫలప్రాప్తికి

దృఢమైన అభ్యాసము ఉండాలి. అభ్యాసము ఎలా దృఢ పడుతుందో కూడా పతంజలి ప్రవచించాడు.

**సూ॥ స తు దీర్ఘకాల నైరన్తర్య సత్కారా సేవితో దృఢభూమిః** (1 - 14)

అభ్యాసము దృఢం కావాలి అంటే (1) దీర్ఘకాలం అభ్యసించాలి. ఎక్కువ కాలం సాధన చేయాలి. (2)నైరంతర్యము అంటే నిరంతరం చేయాలి. (3) సత్కారములతో, అంటే అత్యాదరముతో చేయాలి అన్నాడు పతంజలి. ఈ విషయాన్నే ప్రస్తుత శ్లోకం ప్రతిఫలింప చేస్తూ ఉంది.

నిత్యము పరమేశ్వరుని స్మరించడము ***(నిత్యశః)*** అనే ప్రస్తుత శ్లోకము లోని పదభావన పతంజలి సూత్రం లోని దీర్ఘ కాలత్వాన్ని తెలియజేస్తూ ఉంది ***(నిత్యశః ఇతి దీర్ఘకాలత్వం ఉచ్యతే).*** శ్లోకం లోని ***సతతం*** అనే పదము సూత్రం లోని నైరంతర్యానికి ప్రతిభావనగా ఉంది ***(సతత మితి నైరంతర్య ముచ్యతే).*** ***అనన్య చేతాః*** అనే పదం సూత్రం లోని అత్యాదరమునకు ***(సత్కార ఆసేవితః)*** ప్రతిరూపంగా ఉంది. కనుక సతతము, నిత్యము అనే పదాలు పునరుక్తములు కావు. ఈ విధంగా పరమేశ్వరుని నిత్యము నిరాటంకంగా స్మరించే భక్తులు పరమేశ్వరుని యందే చరిస్తారు. వారే నిత్యయుక్తులు. అంటే, సమాహిత చిత్తులైన యోగులు. అట్టి వారికి పరమేశ్వరుడు కష్టం లేకుండా ప్రాప్తిస్తాడు. అందుకే భగవంతుడు భక్త సులభు డయ్యాడు.

**భక్త సులభుడు**

ఈశ్వర ప్రణిధానము లేదా ఈశ్వర భక్తి చేతనే భగవంతుడు లభిస్తాడు అని అర్థం చేసుకున్నాం. భగవంతుని పొందడం చాలా కష్ట మని, కఠోరమైన సాధనలు ఆచరిస్తే గాని భగవంతుని పొందడం సాధ్యం కాదు అనేది లోక ప్రచారంలో ఉంది. కాని, ఇక్కడేమో పరమేశ్వరుడు సులభుడు అని చెప్పబడుతూ ఉంది.

భగవంతుడు భక్తి చేతనే కదా ప్రాప్తిస్తాడు! ఇక్కడ భగవంతుడు సులభుడు అంటే, ఆయనను పొందటానికి మనం చేసే భక్తి సాధన కూడా సులభము అని అర్థం. అప్పుడే భగవంతుడు సులభుడు అనిపించు కుంటాడు. భక్తి సాధన కష్టమైతే భగవంతుడు కష్టసాధ్య మౌతాడే గాని సులభ సాధ్య మెలా అవుతాడు? కనుక భగవంతుడు సులభుడు లేదా భక్త సులభుడు అంటే, ఆయనను పొందడానికి ఆచరించే భక్తి సాధన కూడా సులభము అని అర్థము.

భగవంతుని నిరంతరం స్మరించడమే కదా భక్తి సాధన! ప్రేమికులు తాము ప్రేమించే వారిని గూర్చి చింతించడం కష్టంగా భావిస్తారా? ప్రేమ కార్యాలు ప్రయత్నాలు లేకుండా పరుగులు తీస్తాయి. మనకు ఆసక్తి గల దానిని చింతించడంలో, మనం ప్రేమించే దానిని సదా స్మరించడంలో శ్రమ ఎక్కడుంది? కష్ట మేముంది? అందుకే భగవంతుడు సులభు డయ్యాడు. భక్తి సులభ మైంది. కనుకనే, ***అన్యస్మాత్ సౌలభ్యం భక్తౌ*** - అన్నిటి కంటే భక్తే సులభము అన్నాడు నారద మహర్షి.

[illegible]తనను తదేకంగా స్మరించే వారిని భగవంతుడు విస్మరిస్తాడా? భగవంతుడు కోరింది చిత్తాన్నే గాని విత్తాన్ని కాదు కదా! భగవంతునికి అర్పించ వలసిన చిత్తాన్ని అన్యులకు అర్పిస్తే ఏమొస్తుంది? అగచాట్లు తప్ప. పరమేశ్వరునికి చిత్తాన్ని సమర్పిస్తే సర్వం సిద్ధిస్తుంది. కారణం, ఆయన భక్త సులభుడు. నిత్య భక్తులైన వారికి నిత్యమూ సులభుడే ***(తస్య భక్తాః ఈశ్వరః సులభః సుఖేన లభ్యః).***

చిత్తాన్ని శివునికి సమర్పించ గలిగితే బ్రతుకులో చింతలు దూర మవుతాయి. మరి చిత్తాన్ని [illegible] గ్రహించకపోతే ఎలా? అనే సందేహం కలిగిన భక్తుడు శివుణ్ణి నొప్పించకుండానే ఒప్పించే [illegible]





**సతి ఒక్కతె ఉండాలి పతికి పార్వతీశ!**
**ఇద్దరున్న పతికి ఆపై ఎందరున్న నేమి?**
**నా చిత్త సుందరిని చేపట్టు చిద్విలాసా!**
**నీ అడుగుల కడ పడి ఉండు నీలకంఠా!**

అని నీలకంఠ శతకంలో ఒక విబూది పండు.

*నిజమే. భగవంతుడు సులభుడే అనుకుందాం. ఈ విధమైన సౌలభ్యం వల్ల ఏమి సిద్ధిస్తుంది? చెబుతున్నాడు.*

మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్ ।
నాప్నువన్తి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః ॥ 15

**మాం-ఉపేత్య-పునర్జన్మ-దుఃఖాలయం-అశాశ్వతం**

**న-ఆప్నువంతి-మహాత్మానః-సంసిద్ధిం-పరమాం-గతాః**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పరమాం | = | ఉత్తమమైన | ఉపేత్య | = | పొంది |
| సంసిద్ధిం | = | మోక్షమును | దుఃఖాలయం | = | దుఃఖమునకు స్థానము |
| గతాః | = | పొందిన | అశాశ్వతం | = | అనిత్యము |
| మహాత్మానః | = | మహాత్ములు | పునర్జన్మ | = | పునర్జన్మమును |
| మాం | = | నన్ను | నాప్నువంతి | = | పొందరు |

**అర్జునా! జన్మలు శోక నిలయాలు. అశాశ్వతాలు. నన్ను పొందిన వారు జన్మ లెత్తరు. వారు మహాత్ములు. మోక్షాన్నే పొందుతారు.**

**వ్యాఖ్య**

తింటే ఆకలి తీరుతుంది. మళ్ళీ కొంత సేపటికి ఆకలి పుడుతుంది. మందు తింటే వ్యాధి నయ మవుతుంది. నయమైన వ్యాధి తిరిగి రాదని చెప్పలేము. దుఃఖం దూరమై మనిషికి సుఖం కలుగుతుంది. అలాగని సుఖం స్థిరంగా ఉండదు. దుఃఖం తిరిగి రాకపోదు. ఆశించి ఆరోగ్యాన్ని పొందినా, అయిష్టమైన అనారోగ్యం ఆశించక పోయినా వచ్చి తీరుతుంది. పుట్టి కనిపించిన మనిషి చచ్చి కనిపించకుండా పోయినా తిరిగి మళ్ళీ ఎక్కడో ఒక చోట పుడుతాడు. బ్రతుకులో రాకపోక లన్నీ ఇలాగే ఉంటాయి. వచ్చే వన్నీ పోయేందుకే వస్తాయి. పోయే వన్నీ తిరిగి వచ్చేందుకే పోతాయి **(పునరావర్తతే).** కాని, ఎవరైతే పరమేశ్వరుని పొందుతారో వారు తిరిగి జన్మించరు. పునర్జన్మ నెత్తరు ***(ఈశ్వరం ఉపేత్య పునః జన్మ న ప్రాప్నువన్తి).*** జన్మ రాహిత్యాన్ని పొందుతారు.

**స్వరూపానుభూతి**

మనిషి దేహంలో ఉన్నాడు. దేహం దేశంలో ఉంది. కాలంలో కొనసాగుతూ ఉంది. ఎవరి దేహ మైనా ఒక కాలంలో, ఒక ప్రదేశం లోనే ఉండ గలదు. ఒక ప్రదేశంలో ఉన్నది మరొక ప్రదేశంలో ఉండలేదు. అందుచేత ఏ ప్రదేశంలో దేహం ఉన్నా, దేహంలో ఉన్న వ్యక్తి సుఖంగా ఉండలేక పోతున్నాడు. ఇందుకు ఒక ప్రదేశం మరొక ప్రదేశం కాకపోవడం ఒక కారణ మైతే, ఒకే ప్రదేశంలో ఉండే అవకాశం లేకపోవడము మరొక కారణము. ఏ ప్రదేశంలో ఉంటే, ఏ స్థానంలో నిలిస్తే తాను అన్ని ప్రదేశాలలో ఉన్న అనుభూతిని పొందగలడో, అట్టి స్థానాన్ని

చేరాలని ప్రతి మనిషి తెలిసో తెలియకో ప్రయత్నిస్తూ ఉన్నాడు. అదే పరమపదం. ముక్తిపదం. మూలస్థానం. మూల స్థానేశ్వర ఆలయం.

మారే దేశ కాలాల్లో చేరి పోయిన దేహం మారరాదని మనం ఎంతగా ప్రయత్నిస్తున్నా అది మారుతూనే ఉంది. మారే దేహంలో ఆయుష్షు కరిగి పోతూనే ఉంది. వయస్సు పెరుగుతూనే ఉంది. వన్నె తరుగుతూనే ఉంది. ఊరు సాగనంపే యత్నంలో ఉండే, ఏరు స్వాగతించే ఉబలాటంలో ఉంది. ఇవన్నీ మృత్యువునే ముందుంచు తున్నాయి. మృత్యుభయాన్ని మనిషిలో పెంచు తున్నాయి.

దేహంలో జరిగే మార్పులు దేహానికి తెలియవు. నాకు తెలుస్తున్నాయి. దేహం జీవించినా జడమే. మరణించినా జడమే. అందుకే దేహానికి జ్ఞానం ఉండదు. దేహ మార్పు లన్నిటినీ తెలుసుకొనే నేను దేహం లాగా జడాన్ని కాను. జ్ఞానస్వరూపుణ్ణి. చైతన్యాన్ని. జడమైన దేహం మరణిస్తుంది. దేహం మరణించినంత మాత్రాన నేను మరణించడం లేదు. జనన మరణాలు లేని జీవుణ్ణి నేను. జీవచైతన్యాన్ని నేను. ఈ సత్యం తెలియని కారణంగా, నేను కాని దేహాన్ని నేను అని భావించి, నాకు లేని చావును కొని తెచ్చుకొని దుఃఖిస్తున్నాను. నాకు లేని పుట్టుకను ఆపాదించుకొని అలమటిస్తున్నాను. ఇది సత్యజ్ఞానము కాదు. మిథ్యా జ్ఞానము.

జీవుడైన నాకు దేహం ఉపాధిగా ఉంది. వాస్తవానికి ఇది అవిద్య వలన ఏర్పడింది. ఇది అవిద్యోపాధి. ఒక ఉపాధికి సంబంధించిన వాడు జీవుడైతే, సకల ఉపాధులను తన అధీనంలో ఉంచుకున్న వాడు ఈశ్వరుడు. జీవేశ్వరు లిరువురు ఒకే చైతన్య స్వరూపమై ఉన్నారు. ఉపాధి భేదం వల్ల జీవేశ్వరుల మధ్య భేదం గోచరిస్తూ ఉంది.

చైతన్యము అద్వయము, అనంతము కనుక జీవేశ్వరు లిరువురు ఒక్కరే అనే అద్వితీయ జ్ఞానం కలిగితే, ఘటాకాశము మహాకాశాన్ని పొందినట్లు, జీవుడు ఈశ్వరుని పొందుతాడు ***(మాం ఉపేత్య, మామ్ ఈశ్వరమ్ ఉపేత్య).*** ఆకాశము ఘటానికి ఎప్పుడూ పరిమితంగా లేదు. జీవుడు ఎప్పుడూ దేహానికి పరిమితుడు కాదు. ఘటం ఉన్నప్పుడు కూడా ఆకాశం అనంతం గానే ఉంది. దేహంలో ఉన్నా జీవుడు సర్వవ్యాపియే. ***పిండస్థోపి ఆత్మా సర్వవ్యాపీ భవతి*** అన్నది ఉపనిషత్తు. ఈ జ్ఞానం కలిగితే చాలు. జీవుడు ఈశ్వరుడు అవుతాడు. సర్వవ్యాపిగా శోభిస్తాడు. దేహానికి పరిమితుడు కాడు కనుక, దేహం మరణించినా తాను మరణించడు. మరణించడు కనుక తిరిగి జన్మించడు ***(న చ పునరా వర్తతే).*** జన్మల నుండి విడి పడతాడు ***(మాం ఉపేత్య మద్భావం ఆపద్య పునః జన్మ న ప్రాప్నువన్తి).*** ఈశ్వరభావాన్ని, అంటే ఈశ్వరస్వరూపాన్ని పొందుతాడు. ఇదే స్వరూపానుభూతి లేదా ఈశ్వరానుభూతి.

పునర్జన్మ ప్రాప్తిస్తే ఏమౌతుంది? తిరిగి జన్మిస్తే వచ్చే నష్ట మేమిటి? అని కొందరు ప్రశ్నిస్తూ ఉంటారు. జన్మ నెత్తవచ్చు. కాని, జన్మ లోని దోషాలు అంటకుండా ఉండటం సాధ్యం కాదు. అక్కడే ఉంది కష్ట మైనా, నష్ట మైనా. ఆ విశేషాలనే చెబుతున్నాడు ***(తద్విశేషేణ మాహ).*** జన్మ అనేది దుఃఖాలయ మని, అశాశ్వత మని తెలుపుతూ, అట్టిది ఎవరి కైనా అవాంఛనీయమే అంటున్నాడు.

## దుఃఖాలయం

ఆలయము అంటే స్థానము లేక చోటు అని అర్థము. దుఃఖాలయము అంటే దుఃఖానికి నిలయము. జన్మ అనేది దుఃఖప్రాప్తి స్థానము. దుఃఖాలకు ఆశ్రయ స్థానము కావడం చేత జన్మ దుఃఖాలయ మైంది. శోక స్థానమైంది. భయహేతు వైంది. మేఘంలో ఏముంటుంది, నీరు తప్ప? జన్మలో మాత్రం ఏముంటుంది, కష్టాలు తప్ప? ***ఆలీయన్తే యస్మిన్ దుఃఖాని ఇతి దుఃఖాలయం*** - దేని యందు దుఃఖాలు దాగి ఉంటాయో అదే దుఃఖాలయం. అదే జన్మము.

దాగింది కనిపించదు. కనిపించ నంత మాత్రాన ఉన్నది లేకుండా పోదు. ప్రయాణంలో ఎప్పుడు ఏది ఎదురు పడుతుందో తెలియదు. అప్రియ మైనది ఏదైనా దుఃఖాన్ని వెంట బెట్టుకొనే వస్తుంది.

ఎంత దారుణ మైన వ్యాధి? ఒక్కసారిగా బయట పడింది. ఇంతకాలం ఎక్కడ ఉందో! అంటూ ఉంటారు. ఎక్కడ ఉంటుంది? దేహం లోనే ఉంటుంది. ఇంతకాలం దాగి ఉన్నది ఈ క్షణాన బయట పడింది. అంతే.

తేలు ఎప్పుడు కుడుతుందో తెలియదు. పాము ఎప్పుడు కరుస్తుందో అర్థం కాదు. వరద లెప్పుడొస్తాయో, పిడుగు లెప్పుడు పడతాయో ఎవరికి తెలుసు? తెలిసినా తెలియక పోయినా ప్రాప్తిస్తే మాత్రం పరితాపం తప్పదు.

జన్మలో జీవనం ఉంది. జీవించా లంటే దేహం ఉండాలి. ప్రయాణానికి వాహనం అవసర మైనట్లు, జీవనానికి దేహం అవసరం. వాహనం ఎప్పుడు చెడుతుందో తెలియదు. చెడిన క్షణాన ప్రయాణం ఆగినట్లే, అలాగే దేహం ఎప్పుడు పాడవుతుందో అర్థం కాదు. పాడైన క్షణాన ప్రస్థానం సాగదు.

కొన్ని దగ్గరైతే దుఃఖం. కొన్ని దూరమైతే దుఃఖం. దగ్గర ఉండాలి అనుకున్నవి దూర మవుతాయి. దూరం కావాలి అనుకున్నవి చేరు వవుతాయి. ఏవి ఎప్పుడు ఎలా ఉంటాయో, ఎవరు ఎప్పుడు ఎలా ఉంటారో అర్థం కాదు. అన్నీ మారుతున్నా, దుఃఖం మాత్రం మారకుండా స్థిరంగా ఉంది. అందుకే జన్మను దుఃఖాలయం అంటున్నాడు భగవంతుడు. ఏమి జన్మమో, దేని కోసమో?

పల్లవి: ఏమి జన్మమో! దేని కోసమో! ॥ ఏమి ॥

చరణములు : (1) ఉరికే మనసు ఊగే బ్రతుకు
తీరని మమతలు తియ్యని బంధాలు
రెప్పపాటులో కనుమరు గౌను
ఒంటరితనమే జంటగ మిగులును ॥ ఏమి జన్మమో ॥

(2) వెలిగే దీపము ఆరిపోవును
వెలుగుల రేడు వెల వెల పోవును
విధి నడిపే వింత నాటకము
అంతమె గాని సొంతము కాదు ॥ ఏమి జన్మమో ॥

(3) అలికిన ఇల్లు పలికిన దేమిటి?
కులికిన ఒళ్ళు నిలిపిన దేమిటి?
చెడిపిన మనస్సు చూపిన దేమిటి?
త్వరపడి చేరుము చైతన్య ధామము ॥ ఏమి జన్మమో ॥

అంటూ దుఃఖాలయ మైన జన్మబంధం నుండి విడివడి మహాత్ములై జీవించ మని చైతన్యగీతం ఎలుగెత్తి చాటింది.

**అశాశ్వతం**

జన్మ కేవలం దుఃఖాలయమే కాదు. అశాశ్వతం కూడా. అనిత్య మైనది కావడం చేత స్థిరమైన రూపంతో ఉండదు *(అశాశ్వతం అనవస్థిత స్వరూపం).* ఏదీ స్థిరం కాదు. ధనికులు క్షణంలో దరిద్రు లవుతారు. దరిద్రులు క్షణాల్లో సంపన్ను లవుతారు. పదవులు ఉన్నట్లే ఉంటాయి. పోయే క్షణాన చెప్పకుండా ఊడి పోతాయి. మనుషులు మారి పోతారు. స్నేహాలు వాడి పోతాయి. ఏం తెలిసి కలిసామో అర్థం కాదు. ఎందుకు విడిపోతామో ఎంతగా ఆలోచించినా అంతు పట్టదు.

చిత్తం నిండా దుఃఖం ఉండే టప్పుడు చేతి నిండా ధనం ఉండి మాత్రం ఏం ప్రయోజనం? బ్రతుకులో ద్రవ్యం - బుద్ధిలో దారిద్ర్యం.

యాజ్ఞవల్క్య మహర్షి సమస్తాన్ని త్యజించి యతి జీవనాన్ని గడపాలని నిశ్చయించు కుంటాడు. తన కున్న ఆస్తిని తన భార్యలైన మైత్రేయి, కాత్యాయనీలకు పంచాలని భావిస్తాడు. ఈ సందర్భంలో మైత్రేయి భర్తను సూటిగా ఒక్క ప్రశ్న అడుగుతుంది.

అయ్యా! ఈ విశ్వం లోని విత్త మంతా నాదైతే, నాకు అమృతత్వము ప్రాప్తిస్తుందా? అని ప్రశ్నించింది. దానికి యాజ్ఞవల్క్య మహర్షి సమాధానం చెబుతూ, మైత్రేయీ! ధనం ప్రాప్తిస్తే, దాని వల్ల నీ జీవితం ధనికుల జీవితంలా ఉంటుంది. అంతే గాని, అర్థం వల్ల అమృతత్వము ప్రాప్తించదు అంటాడు ***(అమృత త్వస్య నాశాస్తి విత్తేన).*** బృహదారణ్య కోపనిషత్తులో సతిపతుల మధ్య జరిగిన ఈ సంవాదముపై సురేశ్వరాచార్యులు తన వార్తికములో మైత్రేయి చేత యాజ్ఞవల్క్యుని అందంగా ఒక్క ప్రశ్న అడిగిస్తాడు.

దేవా! అర్థం వల్ల అమృతత్వము ప్రాప్తించ నపుడు, మీ రెందుకు విత్తాన్ని మాకు పంచి ఇస్తున్నారు? మీకు ఉపకరించనిది మాకు మాత్రం ఎందుకు? అనిత్యమైన సంపదలో మేము మాత్రం ఏం సుఖపడ గలము? నశించేవి, అశాశ్వత మైనవి మాకు ఇవ్వకండి. మీరు ప్రసాదించాలి అనుకుంటే ఏది శాశ్వత సంపదో దానిని అనుగ్రహించండి.

*నాది ర్నాంతో న మధ్యం వా యస్య విత్తస్య విద్యతే ।*
*భోగే న చ క్షయం యాతి తదేవ వసు దీయతామ్ ॥*

స్వామీ! ఏ సంపదకు ఆది మధ్యాంతాలు లేవో, ఏ సంపద అనుభవించిన పిదప నశించదో, అట్టి శాశ్వత సంపదను అనుగ్రహించండి అని మైత్రేయి ప్రార్థించింది. అదే మోక్షము. మనుష లందరూ దీనినే కాంక్షిస్తారు. కాని, మహాత్ములే దీనిని పొందుతారు.

**శాశ్వత పదం**

భగవత్ప్రాప్తిని ఎవరు పొందుతారో వారే మహాత్ములు. భగవత్ప్రాప్తియే మోక్షము. దీనినే గొప్పదైన ***(పరమాం ప్రకృష్టాం)*** సంసిద్ధిగా ***(మోక్షాఖ్యాం సంసిద్ధిం)*** పేర్కొన్నారు.

సాధన ద్వారా పొంద బడేది సాధ్యము. సాధింప బడేదే సిద్ధి. సిద్ధు లనేవి ఎన్నో ఉన్నాయి. సిద్ధులు కల వారు ఎందరో ఉన్నారు. కొందరికి ధనం సిద్ధిస్తుంది. కొందరికి పదవులు సిద్ధిస్తాయి. కొందరికి సంతానం సిద్ధిస్తుంది. కొందరికి అణిమాది సిద్ధులు ప్రాప్తిస్తాయి. అలాంటి యోగులను సిద్ధు లని పిలుస్తారు ***(అణిమాది సిద్ధి ర్యేషా మస్తీతి సిద్ధాః).*** ఈ సిద్ధు లన్నీ క్షణికాలు. అనిత్యాలు. అశాశ్వతాలు. కాలంలో జారి పోతాయి. దేశంలో పారి పోతాయి. దేశకాలాదులను అధిగమించి, నిత్యమై, శాశ్వతమై, మోక్ష మనే పేరుతో ఏది అభివర్ణింప బడుతూ ఉందో ఆ పరమపదమే ఇక్కడ సంసిద్ధిగా పిలువ బడింది. దానిని పొందిన వారే మహాత్ములు.





యతి పురుషులు **(మహాత్మానః యతయః).** ప్రశస్త మైన సిద్ధిని అనగా మోక్షాన్ని, లేదా భగవత్ప్రాప్తిని పొందిన ఈ మహాత్ములు దుఃఖాలయము, అశాశ్వతము అయిన పునర్జన్మను పొందరు. జన్మరాహిత్యంతో తరించి పోతారు.

*అయితే, భగవత్ప్రాప్తిని పొందని వారు పునర్జన్మను [illegible] అంటున్నాడు [illegible]*

**అబ్రహ్మభువనా ల్లోకాః పునరావర్తి నోఽర్జున ।**
**మా ముపేత్య తు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే ॥** 16

**అబ్రహ్మ భువనాత్-లోకాః-పునరావర్తినః-అర్జున**
**మాం-ఉపేత్య-తు-కౌంతేయ-పునర్జన్మ-న-విద్యతే**

| | | | | |
|---|---|---|---|---|
| అర్జున | = అర్జునా! | | మాం | = నన్ను |
| ఆబ్రహ్మభువనాత్ | = బ్రహ్మలోకము వరకును గల | | ఉపేత్య తు | = పొందిన మాత్రమునకే |
| లోకాః | = లోకములు | | పునర్జన్మ | = పునర్జన్మము |
| పునరావర్తినః | = మరల పుట్టుకను కలిగించునవి | | న విద్యతే | = కలుగదు |
| కౌంతేయ | = అర్జునా! | | | |

**కౌంతేయా! అర్జునా! నన్ను పొందిన వారు మాత్రం తిరిగి పుట్టరు. బ్రహ్మలోకంతో సహ ఏ లోకానికి వెళ్ళినా. వాళ్ళు తిరిగి జన్మ నెత్తవలసిందే.**

**వ్యాఖ్య**

పరిమిత మైనది ఏదైనా అంతం కలిగినదే. దృశ్యా లన్నీ పరిమితాలే. పరిచ్ఛిన్నాలే. చూడబడేవి ఏవైనా దృశ్యాలే. లోకాలు కూడా చూడబడు తున్నాయి. కనుక దృశ్యాలే. దృశ్యాలైన లోకాలు పరిమితాలే కనుక. ఏదో ఒక కాలంలో, చివరికి ప్రళయంలో నైనా నశించి పోవలసిందే. ఈ విషయంలో బ్రహ్మలోకం మినహాయింపు లేదు. సృష్టికి పూర్వం బ్రహ్మలోకం లేదు. కనుక ప్రళయంలో బ్రహ్మలోకం కూడా నిలబడదు.

**లోక సంచారము**

జీవుడు ఒక లోకాన్ని చేరాడు అంటే, ఆ లోకం ఏదైనా కావచ్చు, అది తన కన్నా వేరుగా ఉంది కనుకనే దానిని చేరడం జరిగింది. వేరుగా ఉండటము అంటే, దేశంలో లేదా కాలంలో వేరుగా ఉండాలి. లోకాలన్నీ కాలం చేత కొలవబడుతున్నాయి కనుక అవి పరిచ్ఛిన్నాలు. ఇప్పుడు లేక ఇంకొకప్పుడు కలిగేవి కావడం చేత. వేరొకప్పుడు విడిచిపెట్టి రావలసి ఉంటుంది. అందుకే అవి తిరిగి వచ్చేవిగా చెప్పబడ్డాయి **(పునరావర్తినః కాల పరిచ్ఛిన్నత్వాత్).** బ్రహ్మలోకము కూడా కర్మ చేత పొంద బడితే అది కూడా విడువ వలసిందే ***(బ్రహ్మలోక సహితాః లోకాః పునరావర్తినః).***

ఒక లోకము మరొక లోకము కాదు. బ్రహ్మలోకమూ అంతే. కాకపోతే, ఇక్కడ ఒక విషయం మెలిక పడి ఉంది. క్రమముక్తిని గూర్చి మనం ముందే తెలుసుకొని ఉన్నాం కదా! క్రమముక్తిని పొందేవారు బ్రహ్మలోకం చేరి, అక్కడ బ్రహ్మదేవుని నుండి మహావాక్యోపదేశమును పొంది మోక్షమును పొందుతారు. మరి ఇక్కడ **ఆబ్రహ్మ భువనాత్ లోకాః** అనే చోటనే 'బ్రహ్మలోకంతో సహ' అనే అర్థాన్ని గ్రహిస్తే, నశించే బ్రహ్మలోకంలో మోక్షప్రాప్తి ఎలా? అనే ప్రశ్న పుడుతుంది. ఇది చాలా సూక్ష్మమైన విషయం. ఈ కారణం చేతనే **ఆబ్రహ్మ భువనాత్** అంటే, 'బ్రహ్మ లోకంతో సహ' అని కాకుండా, 'బ్రహ్మలోకము వరకు' అని కొందరు అర్థం చెప్పారు. ఇది మాకు ఆమోదం కాదు.

**కృతయుగం:-** కలియుగం కన్నా నాలుగు రెట్లు కాల ప్రమాణం గల కృతయుగము యొక్క కాలము పదిహేడు లక్షల ఇరవై ఎనిమిది వేల సంవత్సరాలు ***(17,28,000).***

ఈ నాలుగు యుగాల కాలమును కూడితే, చతుర్యుగ సంఖ్య నలభై మూడు లక్షల ఇరవై వేలు వస్తుంది. ఇదే మహాయుగం లేదా దైవయుగం. ఇటువంటి మహాయుగాలు వెయ్యి కలిస్తే బ్రహ్మదేవునికి ఒక్క పగలు. అలాగే మరో వెయ్యి చేరితే ఒక్క రాత్రి. ఈ విషయం ఛాందోగ్యము నందు, మహాభారతము నందు కూడా తెలుప బడింది.

*దైవికానాం యుగానాం చ సహస్ర పరి సంఖ్యయా ।*
*బ్రహ్మ మేక మహర్జ్ఞేయం తావతీ రాత్రి రేవ చ ॥*

దైవ యుగాలు, లేదా మహా యుగాలు వెయ్యి అయితే బ్రహ్మదేవునికి ఒక పగలు. రాత్రి కూడా అంతే. బ్రహ్మదేవుని పగటి కాలాన్ని కల్పం అంటారు. రాత్రిని ప్రళయ మని అంటారు. కల్పం ఆరంభం కాగానే, అంటే కల్పాదిలో అవ్యక్తంగా ఉన్న భూతము లన్నీ స్పష్టిగా వ్యక్త మౌతాయి. ప్రళయంలో, అంటే బ్రహ్మదేవుని రాత్రి సంభవించ గానే వ్యక్త మైన భూతజాల మంతా అవ్యక్తం లోకి జారి పోతుంది.

ఎలాగైతే రాత్రిపూట మనలో లయించిన ప్రపంచం మనం నిద్ర లేవగానే వ్యక్త మవుతుందో, అలాగే బ్రహ్మ రాత్రి కాలాన ప్రళయంలో లయించిన భూతజాలము బ్రహ్మ పగటి కాలం ఆరంభం కాగానే (కల్పాదిలో) తిరిగి వ్యక్త మవుతుంది. ఇవే వ్యక్తావ్యక్తములు.

*బ్రహ్మదేవుని దివారాత్రములలో ఈ వ్యక్తావ్యక్తములు జరిగే దెలాగో చెబుతున్నాడు.*

అవ్యక్తా ద్వ్యక్తయః సర్వాః ప్రభవ న్త్యహరాగమే । 18
రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రైవావ్యక్త సంజ్ఞకే ॥

***అవ్యక్తాత్-వ్యక్తయః-సర్వాః-ప్రభవంతి-అహరాగమే***
***రాత్ర్యాగమే-ప్రలీయంతే-తత్ర-ఏవ-అవ్యక్తసంజ్ఞకే***

| | | | | | |
|---|---|---|---|---|---|
| అహరాగమే | = | పగటి ప్రారంభము నందు | రాత్ర్యాగమే | = | రాత్రి కలిగి నపుడు |
| అవ్యక్తాత్ | = | అవ్యక్తము నుండి | అవ్యక్త సంజ్ఞకే | = | అవ్యక్త మనబడు |
| సర్వాః వ్యక్తయః | = | సమస్త వ్యక్త రూపములు | తత్ర ఏవ | = | దాని యందే |
| ప్రభవంతి | = | కలుగుతాయి | ప్రలీయంతే | = | లీన మవుతాయి |

**అర్జునా! బ్రహ్మదేవుని పగలు ప్రారంభం కాగానే అవ్యక్తము నుండి భూతజాల మంతా వ్యక్త మవుతుంది. మళ్ళీ రాత్రి ప్రారంభం కాగానే వ్యక్తమైన దంతా అవ్యక్తంలో లీన మౌతుంది.**

**వ్యాఖ్య**

బ్రహ్మదేవుని యొక్క పగలు చతుర్యుగ సహస్ర పరిమిత మని, అలాగే రాత్రి కూడా అని గ్రహించాము. కాలవిదులు తెలిపిన బ్రహ్మ యొక్క దివారాత్రముల కాల పరిమాణంలో సర్గ లయాది కార్యాలను భగవానుడు ఇప్పుడు విభజించి చూపుతున్నాడు.

బ్రహ్మదేవుని పగటి కాలం రాగానే ***(అహరాగమే, అహ్నః ఆగమః సమయే)*** అవ్యక్తము నుండి ***(అవ్యక్తాత్)*** సమస్తమైన ప్రాణులు ***(సర్వాః వ్యక్తయః స్థావర జంగమ లక్షణాః)*** పుడుతున్నాయి ***(ప్రభవన్తి).***

అవ్యక్తము అంటే ఏదో కాదు బ్రహ్మదేవుని యొక్క నిద్రావస్థ. నిద్రావస్థలో లయించి ఏవైతే ఉన్నట్లు





కనిపించవో, అవి తిరిగి కనిపించడమే వ్యక్తం కావడ మంటే. బ్రహ్మ రాత్రి కాలంలో అవ్యక్త మనే నిద్రావస్థలో లయించి అగోచరము లైన చరాచర భూతము లన్నీ బ్రహ్మ పగటి కాలం ఆరంభం కాగానే వ్యక్తమై కనిపిస్తాయి.

కనుక వ్యక్త మంటే క్రొత్తగా రావడ మని కాదు. అంతవరకు అవ్యక్తంగా ఉన్నవే తిరిగి వ్యక్త మయ్యా యని అర్థము. గత కల్పంలో ఉండి ప్రళయ కాలంలో లయించి అవ్యక్తంగా ఉండిపోయిన భూతకోట్లు, కల్పాది యందు తిరిగి వ్యక్తమై కనిపిస్తున్నాయి. అంటే ఉన్నవి రావడం జరిగిందే గాని లేనివి రాలేదు. లేనిది అంటే శూన్య మని అర్థం. లేని దాని నుండి రావడం అంటే శూన్యం నుండి ఉత్పన్నం కావడ మనే భావము. లేని దాని నుండి ఏదైనా ఎలా వస్తుంది? అలా వస్తుందని వాదించే వారు కూడా ఉన్నారు. దీనినే 'అసదుత్పత్తి ప్రసంగం' అంటారు. ఈ అప్రస్తుత ప్రసంగాన్ని 'వ్యక్తావ్యక్త ప్రసంగం' చేత ఖండిస్తున్నారు.

అవ్యక్తంగా బీజ రూపంగా ఉన్నదే జగత్తుగా వ్యక్త మైంది ***(బీజస్యాన్తరి వాఙ్కురో జగదిదం ప్రాక్ నిర్వికల్పం).*** ఇకపోతే, నాలుగు యుగాలు కలిసిన మహాయుగం యొక్క సంఖ్య నలభై మూడు లక్షల ఇరవై వేల సంవత్సరాలు అని తెలుసుకున్నాం. అలాగే వెయ్యి మహాయుగాలు బ్రహ్మకు ఒక పగలు అని కూడా గ్రహించాము. అలాగే ఆయన రాత్రి కూడా. ఈ విధంగా బ్రహ్మదేవునికి మూడువందల అరవై రోజులు గడిస్తే ఆయనకు ఒక సంవత్సరము. అలాంటి వంద సంవత్సరాలు బ్రహ్మ యొక్క ఆయుర్దాయము. అంటే బ్రహ్మ యొక్క నిద్రా జాగ్రత్తులనే ప్రళయ కల్పాలు ముప్పై ఆరు వేల సార్లు జరిగితే బ్రహ్మదేవుని ఆయుర్దాయం ముగిసినట్లే. బ్రహ్మ ఆయుష్షు ముగిసింది అంటే, బ్రహ్మలోకం యొక్క ఆయుర్దాయం కూడా తీరిపోయిందని భావము. మనకు ఆయుష్షు నిచ్చిన వాడే ఈ స్థితిలో ఆయుష్షును కోల్పోతున్నాడు. ఆయుష్షు ఉన్నవాడు ఎవడైనా ఒకనాడు ఆయుష్షును పోగొట్టుకొనే వాడే. బ్రహ్మ ఉండేదే బ్రహ్మలోకం. బ్రహ్మ ఆయుర్దాయం ముగిసి బ్రహ్మ అంతమైతే, ఇక బ్రహ్మలోకం ఎక్కడిది? బ్రహ్మ ఉంటేనే కదా బ్రహ్మలోకం! అందుకే బ్రహ్మలోకం కూడా నశించేదే. అది దీర్ఘకాలం ఉంటుందనేది ప్రక్కన పెడితే, బ్రహ్మలోకం కూడా అన్ని లోకాలకు మల్లే నశించేదే. లోకాల నాశ్రయించే వారు పునర్జన్మను పొందుతారు. నన్ను పొందిన వారు జన్మకు రారు అని పదహారవ శ్లోకంలో గీతాచార్యుడు చెప్పడం లోని అంతర్భావం ఇదే.

*పరమేశ్వరుని పొందనంత వరకు జీవులు ఇలా జనన మరణ చక్రంలో తగులుకొని పరిభ్రమిస్తూనే ఉంటారు. వినండి.*

భూతగ్రామః స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే । 19
రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవ త్యహ రాగమే ॥

***భూతగ్రామః-సః-ఏవ-అయం-భూత్వా-భూత్వా-ప్రలీయతే***
***రాత్ర్యాగమే-అవశః-పార్థ-ప్రభవతి-అహరాగమే***

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ | = | అర్జునా! | భూత్వా భూత్వా | = | మరల మరల |
| భూతగ్రామః | = | భూత సమూహమును | ప్రలీయతే | = | లీన మవుతూ ఉంది |
| స ఏవ అయం | = | అదియే | అహరాగమే | = | పగలు వచ్చి నపుడు |
| అవశః | = | వశము లేక | ప్రభవతి | = | పుట్టుచున్నది |
| రాత్ర్యాగమే | = | రాత్రి ప్రారంభ మైనపుడు | | | |

**అర్జునా! ఈ భూతకోట్లు పూర్వం ఉన్నవే. పరాధీనమై పుట్టి పుట్టి బ్రహ్మదేవుని రాత్రి రాగానే విలీనమై పోతున్నాయి. బ్రహ్మదేవుని పగటి కాలం రాగానే తిరిగి పుడుతున్నాయి.**

### వ్యాఖ్య

అవ్యక్తము నుండి వ్యక్త మైన భూతకోట్లు తిరిగి అవ్యక్తము నందే విలీన మౌతున్నాయి. ***అదర్శనాత్ ఆపతితః పునశ్చాదర్శనం గతః*** - అగోచరమైన చోటు నుండి వచ్చిన మనం తిరిగి అగోచరమైన చోటికే చేరుతున్నాం అన్నది మహాభారతం. ఇలా రావడం అనేది బ్రహ్మకు పగటి కాలం ప్రారంభం కాగానే జరుగుతుంది. ఈ విధంగా వచ్చిన స్థావర జంగమాత్మక మైన భూత సముదాయం ***(భూతగ్రామః)*** బ్రహ్మ పగటి కాలం జరుగునంత కాలము, అనగా వేయి మహాయుగాలు పూర్తి అయ్యే వరకు పుట్టి పుట్టి ***(భూత్వా భూత్వా).*** అంటే అనేక జన్మలెత్తి, కర్మ పరాధీనమై, బ్రహ్మకు పగలు అస్తమించి రాత్రి రాగానే, వశం తప్పి, అస్వతంత్రంగా ***(అవశః అస్వతంత్రః)*** విలీన మౌతుంది. తిరిగి బ్రహ్మకు పగటి కాలం రాగానే ***(అహరాగమే)*** పూర్వం లయించిన భూత సముదాయమే తిరిగి పుడుతూ ఉంది ***(ప్రభవతి).***

ఇలా పుట్టిన భూతజాలము బ్రహ్మకు పగటి కాలం పూర్తయ్యే వరకు ఈ లోకంలో పుడుతూ చస్తూ, చస్తూ పుడుతూ జనన మరణ చక్ర వలయంలో చిక్కుకొని, ఎన్నో లెక్క లేనన్ని జన్మలు ఎత్తుతూ ఉంటుంది. ఈ విషయంలో ఏ విధమైన స్వేచ్ఛా స్వాతంత్ర్యములు లేకుండా కర్మ వశమై పుడుతూ ఉంటుంది. అలా ఎందుకు జరుగుతూ ఉంది? జీవకోటి స్వతః అవిద్యాది పంచక్లేశముల చేత ఆచరించిన పుణ్య పాప కర్మలకు వశమై, ఆయా కర్మఫలాలను అనుభవించటానికి మళ్ళీ మళ్ళీ పుడుతూ ఉంటుంది.

**సూ॥ అవిద్యా స్మితా రాగద్వేషాభినివేశాః క్లేశాః**

అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము - ఇవియే పంచక్లేశములు.

(1) అవిద్య అంటే మిథ్యా జ్ఞానము. అనిత్యాలను నిత్యాలుగా, అశుచిని శుచిగా, దుఃఖాన్ని సుఖంగా, అనాత్మను ఆత్మగా భావించడం ఏదైతే ఉందో అది అవిద్య అని పతంజలి ***(అనిత్యా శుచి దుఃఖానాత్మసు నిత్యశుచి సుఖాత్మ ఖ్యాతిః అవిద్యా*** *- 2 - 5).*

(2) అస్మిత అంటే దేహ తాదాత్మ్యము. దేహాన్ని - ఆత్మను, బుద్ధిని - ఆత్మను, ఇంద్రియాలను - ఆత్మను, ప్రాణమును - ఆత్మను కలిపి ఒకటిగా చూడటం అస్మిత.

(3) రాగము అంటే విషయ ప్రియత్వము. విషయ సుఖాభిలాష, అనిత్య విషయాల పట్ల అభిరుచి.

(4) ద్వేషము అంటే అప్రియ విషయాల యందు అసహనము. రాగానికి విరుద్ధ మైన భావము. 'నేను - వాది' అనే అవిద్యా విషయము లందే రాగద్వేషాలు జనిస్తూ ఉంటాయి.

(5) అభినివేశము అంటే ప్రాణము నందు తీపి. నేను మరణించకుండా ఉండాలి అనే ఉత్కంఠ అభినివేశము. పూర్వ జన్మలలో మరణ సమయాన తాను మరణించ కూడదని, ఎలాగైనా బ్రతకాలని పడిన తహతహ వలన కలిగిన సంస్కారము కూడా ఈ అభినివేశానికి ఒక కారణంగా ఉంటుంది.

ఈ విధమైన అవిద్యాది అభినివేశాంత పంచక్లేశ కారణంగా పుణ్యాపాప కర్మల సుడిగుండంలో చిక్కుకొనిన జీవుడు కర్మ పరాధీనుడై, అస్వతంత్రుడై జనన మరణాలను పొంది, దుఃఖాన్ని అనుభవిస్తూ ఉంటాడు. ఇలా కర్మసుడిలో పడి పరిభ్రమిస్తున్నాడే గాని భవసాగర తీరాన్ని చేరలేక పోతున్నాడు. ఈ సత్యం అర్థమైతే (1)జీవికి వైరాగ్యం కలుగుతుంది ***(సంసారే వైరాగ్య ప్రదర్శనార్థం).*** (2) బంధమోక్షాలను తెలియచేసే వేదాంత శాస్త్రాన్ని అధ్యయనం చేయాలి అనే జిజ్ఞాస ప్రాప్తిస్తుంది ***(బంధమోక్ష శాస్త్ర ప్రవృత్తి సాఫల్య ప్రదర్శనార్థం).*** ఈ ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని ప్రస్తుత శ్లోకం చెప్పబడింది.





రంగుల రాట్నంలో కూర్చుని పరిభ్రమించే వాడు స్వతః దిగాలనుకున్నా దిగలేడు. సంసార చక్రంలో పడి తిరిగే వాడు సంసారం నుండి బయట పడటం కూడా అలాగే ఉంటుంది. సంసారంలో ఉండి సంసారాన్ని పరిష్కరించ లేము.

త్రిప్పేవాణ్ణి ఆశ్రయిస్తేనే రంగుల రాట్నంలో పరిభ్రమించే వాడు దాని నుండి సురక్షితంగా బయట పడతాడు. పరమేశ్వరుని పొందిన వాడే **(మాముపేత్య)** జన్మకర్మల నుండి విడిపడి తరిస్తాడు ***(పునర్జన్మ న విద్యతే).***

సంసార భ్రాంతిలో పడి జీవులు ఎంతగా శ్రమిస్తారో! ఎన్ని గాలిమేడలు నిర్మించుకుంటారో! అవన్నీ పేకమేడలై కూలి నపుడు, నీటి బుడగలై పగిలి నపుడు, మట్టిగోడలై కూలినపుడు జీవులు ఎంతగా కుమిలి పోతారో! ఎంత కన్నీరు కార్చుతారో! జన్మల జాడలు తెలియక, నీడలే నిజాలని నమ్మి ఎంత మోసపోతారో! ఈ మాయ నుండి విడిపడి మహిమగా శోభిల్లాలి అంటే, బుద్ధిని పరమేశ్వరునికి అర్పించాలి. బుద్ధిలో భగవంతుని ప్రతిష్ఠించుకోవాలి.

*పల్లవి:* **గాలి మేడలు నీటి ఓడలు - మట్టి గోడలు మనిషి జాడలు**
*అనుపల్లవి :* **నీడలు తోడు నీడలు - నీడివ్వని నీలి నీడలు ॥ గాలి ॥**
*చరణము :* **కరిగే కలలో కదిలే కళలు కళ్ళు తెరిచితే కల్లలు - చెల్లు రాతలు**
**జీవి బ్రతుకులో చదరంగాలు ఛాయ లుడిగితే మాయలు - మటు మాయలు**
**మంచు కరిగితే మనసు మరిగితే కనిపించేవి మహిమలు - దైవ మహిమలు**
**బుద్ధి పండితే బ్రతుకు నిండితే భాసించేది బ్రహ్మము - పరబ్రహ్మము ॥ గాలి ॥**

అంటూ మాయకు చరమగీతాన్ని, మహిమకు స్వాగత గీతాన్ని ఆలపించింది చైతన్యగీతిక.

*నాశ రహితమైన పరమాత్మ స్వరూపమును, పరమాత్మ ప్రాప్తికి ఉపాయమును ఉపదేశిస్తున్నాడు.*

పర స్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః । 20
యః స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి ॥

*పరః-తస్మాత్-తు-భావః-అన్యః-అవ్యక్తః-అవ్యక్తాత్-సనాతనః*
*యః-సః-సర్వేషు-భూతేషు-నశ్యత్సు-న-వినశ్యతి*

| | | | | | |
|---|---|---|---|---|---|
| యః | = | ఏ | సనాతనః | = | శాశ్వత మైనది |
| భావః తు | = | భావము అయితే | సః | = | ఆ |
| తస్మాత్ | = | ఆ | భావః | = | భావము |
| అవ్యక్తాత్ | = | అవ్యక్తము కంటెను | సర్వేషు భూతేషు | = | సమస్త భూతములు |
| అన్యః | = | ఇతర మైనదియు | నశ్యత్సు | = | నశిస్తూ ఉండినా |
| పరః | = | ఉత్తమ మైనదియు | న వినశ్యతి | = | నశించదు |
| అవ్యక్తః | = | వ్యక్తము కానిదియు | | | |

**అర్జునా! అక్షర స్వరూపుడైన పరమాత్మ అవ్యక్తము కంటే అన్యమైన వాడు. శ్రేష్ఠమైన వాడు. ఇంద్రియాలకు వ్యక్తం కానివాడు. పురాతనుడు. సర్వ ప్రాణులు నశిస్తున్నా తాను నశించడు.**

**వ్యాఖ్య**

బ్రహ్మలోకంతో సహా ఏ లోకాన్ని చేరినా అవశులైన జీవులు పునర్జన్మను పొందక తప్పదు. పరమేశ్వరుని పొందిన వారు మాత్రమే జన్మ రాహిత్యమును పొందుతారు. ఈ రెండు విషయాలను పదహారవ శ్లోకంలో ప్రతిపాదించిన భగవంతుడు ఆ తరువాత మూడు శ్లోకాలలో శ్లోక పూర్వార్థాన్ని వ్యాఖ్యానించి, ప్రస్తుత శ్లోకంలో పరమేశ్వరుని పొందిన వారు తిరిగి జన్మించరు అనే శ్లోక ఉత్తరార్థాన్ని వ్యాఖ్యానిస్తున్నాడు.

కల్పాది నుండి కల్పాంతం వరకు బ్రహ్మకు పగటి కాలమైన దానిలో ఏది వ్యక్తంగా తెలుస్తూ ఉందో, ప్రళయాది నుండి కల్పాది వరకు బ్రహ్మకు రాత్రి కాలమైన దానిలో ఏది అవ్యక్తంగా తెలుస్తూ ఉందో, ఈ రెండూ కాల పరిచ్ఛిన్నత్వము చేత అనిత్యాలుగా నిర్ధారింప బడ్డాయి. అన్నీ అనిత్యాలే అయితే ఇక జీవుల పరిస్థితి ఏమిటి? అనే సందేహం కలుగుతుంది. వ్యక్తావ్యక్తాలు అనిత్యాలే గాని, వాటికి విలక్షణంగా ఉన్న పరమేశ్వరుడు నిత్యుడే కదా! ఆ పరమేశ్వర తత్త్వమే ఇక్కడ అవ్యక్తం కన్నా వేరుగా ఉన్న అవ్యక్తంగా చెప్పబడుతూ ఉంది.

వ్యక్తావ్యక్తముల ప్రసంగంలో ఏది అవ్యక్తంగా చెప్పబడిందో, దాని కంటే ప్రస్తుతం చెప్పబడుతున్న అవ్యక్తము విలక్షణ మైంది అని తెలియ చేయడానికే **తు** శబ్దం ప్రయోగించ బడింది. క్రొత్త విషయం ప్రస్తావనకు వచ్చే సందర్భాలలో **తు** శబ్ద ప్రయోగం జరుగుతూ ఉంటుంది.

అవ్యక్తము కంటే వేరైన అవ్యక్తము ***(అవ్యక్తాత్ పరః అవ్యక్తః)*** విలక్షణ మైనది ***(అన్యః)*** అంటున్నాడు. వేరైనది అయినా ***(పరం)*** రెండిటికీ సామాన్య లక్షణాలు ఉన్నట్లు కనిపించే ప్రమాదం ఉన్నందున, దానిని వారించే ప్రయత్నంలో, ***అన్యః*** అనే పద ప్రయోగము ద్వారా అవ్యక్తము యొక్క విలక్షణ స్థితిని తెలుపుతూ, సాలక్షణ్య ప్రసంగాన్ని (రెండిటికి పోలిక ఉందనే వాదమును) నివర్తింప చేశాడు.

వ్యక్తం కన్నా పరమైనది అవ్యక్త మైతే, అవ్యక్తం కన్నా పరమైన అవ్యక్తం పరము కన్నా పరమైనది. పరాత్పరంగా, పరమగతిగా తెలియబడేది అదే. అదే అక్షరం. పరాత్పరం. ఈ సత్యాన్ని కఠోపనిషత్ సుస్పష్టం చేసింది.

***మహతః పరం అవ్యక్తం అవ్యక్తాత్ పురుషః పరః ।***
***పురుషాత్ న పరం కించిత్ సా కాష్ఠా సా పరాగతిః ॥***

మహత్తు కంటే (అవ్యక్త జనిత అఖిల జగత్కారణ భూత తత్త్వము మహత్తు) అవ్యక్తము శ్రేష్ఠ మైనది. అవ్యక్తము కంటే పురుషుడు పరమైన వాడు (పరాత్పరుడు). పురుషుని కంటే శ్రేష్ఠ మైనది ఏదీ లేదు. అదే చివరి గమ్యము. అదే పరమగతి.

ఈ పరాత్పర స్వరూపమునకు రూపము లేనందున ***(న తస్య ప్రతిమా అస్తి)*** చక్షురాది ఇంద్రియాలకు అగోచరంగా ఉంది. అలాగని లేనిది కాదు. గోచరించే వాటిలో అగోచరంగా ఉండి, కనిపించేవి (వ్యక్తం) నశించినా కనిపించనివి (అవ్యక్తం) నశించినా తాను మాత్రం నశించని అక్షరంగా అవ్యక్తంగా శోభిస్తూ ఉంది. అందుచేత అది సనాతనం. బ్రహ్మాది స్తంబ పర్యంతం సర్వము నశించినా పరాత్పరుడైన అవ్యక్త పరబ్రహ్మము నశించడు.

అట్టి పరాత్పరుని పొందిన వారు తిరిగి పుట్టరు ***(న చ పునరావర్తతే)***. ఇది రాక లేని పోక. అలాంటి పరాత్పరుడు, అనంతుడు అయిన పరమాత్మను ఎలా పొందాలి? ఏ ప్రయత్నంతో పొందాలి? ఏ ప్రయత్నం చేసినా పరాత్పరుని పొందలేవు. అంతం కలిగిన ప్రయత్నాలతో అనంతుని ఎలా పొందుతావు? పరాత్పరుడు





అనంతు డైనపుడు అతని కన్నా అన్యంగా నీవు లేవు కనుక నీవూ అనంతం లోనే ఉన్నావు. కాదు, అనంతం గానే ఉన్నావు. అనంతంగా ఉన్నావు కనుకనే అనంతాన్ని పొందగలవు. అనంతంగా ఉండే టప్పుడు మళ్ళీ అనంతాన్ని పొందడ మేమిటి? నీవు అనంతం అనే జ్ఞానము ఇప్పుడు లేనందున, జ్ఞానాన్ని పొందితే నీవే అది అని తెలుసుకుంటావు **(జ్ఞానా దేవ తు కైవల్యం)**. అదే కైవల్య పదం. పరమ పదం.

పరమ పదమే పరాత్పర స్వరూపం. పరమాత్మ స్వరూపం. చదవండి.

**అవ్య క్తో౽క్షర ఇత్యుక్త స్తమాహుః పరమాం గతిమ్ ।** 21
**యం ప్రాప్య న నివర్తన్తే తద్ధామ పరమం మమ ॥**

**అవ్యక్తః-అక్షరః-ఇతి-ఉక్తః-తం-ఆహుః-పరమాం-గతిం**
**యం-ప్రాప్య-న-నివర్తంతే-తత్-ధామ-పరమం-మమ**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అవ్యక్తః | = | అవ్యక్తుడు | యం | = | దేనిని |
| అక్షరః | = | అవినాశి | ప్రాప్య | = | పొంది |
| ఇతి | = | అని | న నివర్తంతే | = | తిరిగిరారో |
| ఉక్తః | = | చెప్పబడిన | తత్ | = | అట్టి |
| తం | = | ఆ పరమాత్మను | మమ | = | నా యొక్క |
| పరమాం | = | ఉత్తమమైన | ధామ | = | స్థానము |
| గతిం | = | స్థానముగా | పరమం | = | శ్రేష్ఠ మైనది |
| ఆహుః | = | చెబుతున్నారు | | | |

**అర్జునా! పరమాత్మ అవ్యక్తుడు. అక్షరుడు. అతడే జీవుల పరమగతి. అతనిని పొందిన వారు తిరిగి జన్మకు రారు. ఆ పరంధామము నాదే.**

**వ్యాఖ్య**

వ్యక్తావ్యక్తములకు అన్య మైనది, అతీత మైనది అయిన అవ్యక్తమును పరాత్పరుడు అని తెలుసు కున్నాము. పరాత్పర మైన అవ్యక్తము అక్షరం అని చెప్ప బడింది ***(అవ్యక్తః అక్షరః ఇతి ఉక్తః)***. ఈ అక్షరమైన భావమునే పరమగతిగా విజ్ఞులు చెబుతున్నారు ***(తమ్ పరమాం గతిం ఆహుః)***. ఉత్తమమైన ఈ గతిని అందరూ పొందలేక పోయినా, అందరూ వాంఛించేది మాత్రము ఇదే. అందరి జీవిత గమ్యము అక్షరమైన అవ్యక్తమే. అక్కడికి చేరాలి అనేదే అందరి ఆశయము.

ఎవరు ఎక్కడికి చేరాలని నిర్ణయించుకున్నా, ఆ చోటు ఉన్న చోటి కన్నా మిన్నగా ఉండాలి. ఉంటుంది. లేకపోతే ఉన్న దానిని ఎవరైనా ఎందుకు వదులు కుంటారు? మచ్చుకు స్వర్గాన్నే తీసుకుందాం. స్వర్గాభిలాషులు ఎందుకని స్వర్గానికి పోదా మనుకుంటారు? మానవ లోకంలో ప్రాప్తించే సుఖాల కన్నా స్వర్గ సుఖాలు మిన్నగా ఉంటాయి కనుకనే స్వర్గాన్ని వాంఛిస్తారు. ఏది ఏమైనా, తానున్న చోటు, తానున్న పరిస్థితి నచ్చక పోవడం చేతనే మరొక చోట, మరొక పరిస్థితిలో ఉండాలని మనిషి అభిలషిస్తాడు. అలా ఉండటం చేత తనలో అసంతృప్తి ఉండదని అభిప్రాయ పడతాడు. కాని వాస్తవం అలా లేదు. ఒక్క స్వర్గమే కాదు, బ్రహ్మలోకంతో సహా ఏ లోకాన్ని పొందినా దానిని విడిచిపెట్టి తిరిగి రావలసిందే. పైగా ఏ లోకమైనా క్షరమే. క్షరమైన లోకాన్ని పొందినా, దానిని విడిచి వచ్చిన తరువాత ***(లోకాః పునరావర్తినః)*** మళ్ళీ తృప్తి లేని జీవితమే. అలా జరగకుండా ఉండాలి అంటే మనం చేరే చోటు ఏదో అది క్షరం కానిదై ఉండాలి. అక్షరమై ఉండాలి. అదే పరమగతిగా ఉండాలి.

విజ్ఞులు అదే దర్శించారు. దానినే ప్రవచించారు *(తం అక్షరాఖ్యం బ్రహ్మ పరమాం ప్రకృష్టాం గతిమ్).* ఆ పరమగతియే అక్షర స్వరూపమైన పరబ్రహ్మము.

కావచ్చు. అవ్యక్తమైన బ్రహ్మము అక్షరమే కావచ్చు. దాని వల్ల మనకు కలిగే ప్రయోజన మేమిటి? దానిని పొందితే, దుఃఖాలయము, అశాశ్వతము అయిన జన్మను పొందడం ఉండదు *(8 - 15).* బ్రహ్మము అక్షరము కనుక నశించదు. అందుచేత దాని నుండి తిరిగి రావడం జరగదు *(యం ప్రాప్య న నివర్తన్తే).* అంటే అక్షర పరబ్రహ్మమును పొందిన వారు తిరిగి సంసారంలో ప్రవేశించరు *(యం అక్షరం బ్రహ్మ ప్రాప్య గత్వా, న నివర్తన్తే సంసారాయ).* ఆ పరమగతియే పరంధామము. ఉత్పత్తి వినాశ శూన్య స్వప్రకాశ పరంధామము. అదే బ్రహ్మప్రాప్తి ప్రయోజనము. ధామము అనగా స్థానము లేదా చోటు అని అర్థము. పరమాత్మ ఉండే స్థానమే పరంధామము. కనుకనే, అది నా పరమమైన ధామము అంటున్నాడు భగవంతుడు *(తత్ ధామ మమ పరమమ్).*

**మమ ధామ** అంటే నా యొక్క ధామము అనే షష్ఠి ప్రయోగం వల్ల భేద కల్పన జరిగింది కదా! నా యొక్క ధామము అంటే నేను వేరు - నా ధామము వేరు అనే అర్థం రాదా? 'నా గృహం' అన్నప్పుడు నేను వేరు - నా గృహం వేరు అనే అర్థం వస్తుంది కదా! అలాగే నా ధామము అన్నప్పుడు నేను వేరు - నా ధామము వేరు అనే అర్థం వస్తుంది. అలా అయితే, మనం చేరేది బ్రహ్మమునా, బ్రహ్మధామమునా? అనే శంక తలెత్తుతుంది కదా!

నా ధామము అంటే నేను వేరు - నా ధామము వేరు అని అర్థం కాదు. **మమ ధామ** అనే దానిని **రాహోశ్శిరః** అనే చోట అర్థమును గ్రహించినట్లు గ్రహించాలి. **రాహోశ్శిరః** అంటే రాహువు శిరము అని అర్థము. అంటే రాహువు యొక్క శిరము అని అర్థం కాదు కదా! రాహువుకు వేరుగా దేహం ఉంటే కదా రాహువు యొక్క తల అనడానికి? తలే రాహువు. అలాగే దివ్యమైన ధామమే బ్రహ్మము. బ్రహ్మమే దివ్య ధామము. అందుచేత దానిని పొందిన వారు తిరిగి జన్మకు రారు *(న చ పునరావర్తతే).*

*అట్టి పరమాత్మను పొందే ఉపాయమును తెలుపు తున్నాడు.*

**పురుషః స పరః పార్థ భక్త్యా లభ్య స్త్వనన్యయా ।**
**య స్యాన్తఃస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్ ॥** 22

*పురుషః-సః-పరః-పార్థ-భక్త్యా-లభ్యః-తు-అనన్యయా*
*యస్య-అంతఃస్థాని-భూతాని-యేన-సర్వం-ఇదం-తతం*

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ | = | అర్జునా! | తతం | = | వ్యాప్త మైనదో |
| భూతాని | = | భూతములు | సః | = | ఆ |
| యస్య | = | ఎవని యొక్క | పరః | = | ఉత్తముడైన |
| అంతఃస్థాని | = | లోపల ఉన్నవో | పురుషః | = | పురుషుడు |
| యేన | = | ఎవని చేత | అనన్యయా | = | ఏకాగ్రమైన |
| సర్వం | = | సమస్తమైన | భక్త్యా తు | = | భక్తి చేతనే |
| ఇదం | = | ఈ జగత్తు | లభ్యః | = | లభిస్తాడు |

**అర్జునా! ప్రాణు లన్నీ అతని యందే ఉన్నాయి. ఈ ప్రపంచ మంతా అతని చేతనే పరివ్యాప్తమై ఉంది. అట్టి పురుషోత్తముడు అనన్య భక్తి చేత లభిస్తాడు.**





**వ్యాఖ్య**

అవ్యక్తము కన్నా అన్యమైన అవ్యక్త రూపుడే అక్షర పరబ్రహ్మము అని ఇరవయ్యవ శ్లోకంలో చూశాం. అది సర్వ శ్రేష్ఠ మని గ్రహించాము. దానిని పొందితే తిరిగి జన్మకు రావడం జరగదు అని కూడా తెలుసు కున్నాం. మరి అలాంటి అక్షర పరబ్రహ్మమును ఎలా పొందాలి? అని ప్రశ్నించే చిత్తశుద్ధి గల ముముక్షువులకు బ్రహ్మప్రాప్తికి ఉపాయమైన ముఖ్య సాధనమును **పురుషః** అనే ప్రస్తుత శ్లోకము ద్వారా ఉపదేశిస్తున్నాడు.

**పురుషః - *(1) పురి శయనాత్ పురుషః.*** పురి అంటే శరీరము. పురిలో శయనించడం చేత పురుషుడు అని ఒక అర్థము. ***(2) పూర్ణత్వా ద్వా పురుషః.*** పూర్ణుడు కావడం చేత పురుషుడు అని మరియొక అర్థము. దీనిని బట్టి అవ్యక్త స్వరూపుడైన ఏ అక్షర పరబ్రహ్మమును మనం తెలుసుకున్నామో, అతడే మన శరీరంలో పురుషుడై ఉన్నాడు. అంతేకాదు అతడే ఈ జగత్తులో పూర్ణంగా నిండి యున్నాడు అని **పూర్ణత్వాత్** అనే పదం తెలుపుతూ ఉంది. ఒక్క వాక్యంలో, ప్రామాణికంగా శ్రుతి వాక్యంలో చెప్పాలి అంటే, **సర్వమిద మహం చ బ్రహ్మైవ** - ఈ ప్రపంచము, మరియు నేను కలిసి సర్వమూ బ్రహ్మమే.

అలాంటి బ్రహ్మమును పొందడానికి ఎక్కడికి పోవాలి? ఎక్కడికో పోవడానికి అతడు ఎక్కడో ఉంటే కదా! అంతటా ఉండేవాణ్ణి ఎక్కడికి వెళ్ళి పట్టుకోవాలి? అందరిలో పురుషుడుగా తానే ఉన్నాడు. ప్రపంచం అంతటా పూర్ణ రూపుడుగా తానే వ్యాపించి యున్నాడు. అలాంటి వాణ్ణి పొందడము అంటే అతణ్ణి గుర్తించడమే. ఎలా గుర్తించాలి? భక్తి చేతనే గుర్తించాలి. అనన్యమైన భక్తి చేతనే గుర్తించాలి. **వాసుదేవః సర్వమితి** - అంతటా వాసుదేవుడే అని గుర్తించాలి. ఇదే భక్తి. పరమేశ్వరునికి సంబంధించిన జ్ఞానమే భక్తి.

***మోక్ష కారణ సామగ్ర్యాం భక్తి రేవ గరీయసీ***
***స్వ స్వరూపాను సంధానం భక్తి రిత్యభిధీయతే ॥***

మోక్షానికి శాస్త్రోక్త మైన సాధనలలో భక్తియే శ్రేష్ఠ మైనది. స్వస్వరూపాను సంధానమే భక్తి అని చెప్పబడింది. ఆత్మయే బ్రహ్మము అనే స్వరూప విచారమే భక్తి అని అర్థము. దీనినే పరాభక్తి లేదా అనన్య భక్తి అంటారు.

కార్య రూపంలో తెలిసే సమస్త భూత ప్రపంచానికి పరమాత్మ కారణం. కార్యంలో ఉన్నదంతా కారణమే. మరి కార్యం ఉండేది కారణం లోనే కదా! ***(కార్యం కారణస్య అన్తర్వర్తి భవతి!).***

కార్య రూపంలో తెలిసే కెరటాలకు కారణమైన కడలి, కెరటాలకు వేరుగా ఉందా? కెరటాలుగా కనిపించేది కడలి జలమే కదా! కార్యాలైన కెరటా లన్నీ కారణమైన కడలి లోనే కదా ఉన్నాయి! అలాగే చరాచర భూతజాల మంతా పరమేశ్వరుని యందే ఉంది ***(యస్య పురుషస్య అన్తః స్థాని మధ్యస్థాని కార్యభూతాని).***

కార్యాలైన కెరటాలలో కడలి జలమే వ్యాపించి ఉన్నట్లు, కార్య రూపమైన ఈ జగత్తంతా కారణ రూపుడైన పురుషుని చేతనే పరివ్యాప్తమై ఉంది ***(యేన పురుషేణ సర్వం ఇదం జగత్ తతం వ్యాప్తం).*** ఈ విధమైన అఖండరూప స్థితిని గుర్తించడమే భక్తి. అట్టి జ్ఞాన సంబంధమైన భక్తి కలవాడు భాగవతోత్తముడు.

***సర్వ భూతేషు యః పశ్యేత్ భగవద్భావం ఆత్మనః***
***భూతాని భగవత్యాత్మ న్యేష భాగవతోత్తమః ॥***

సమస్త భూతములను ఎవడైతే భగవద్భావముతో చూస్తాడో, సర్వ భూతాలను భగవత్స్వరూప మైన తన ఆత్మలో దర్శిస్తాడో, వాడే భాగవతోత్తముడు.

అవగాహన ఉంటేనే భక్తి కుదురుతుంది. ఈశ్వర జ్ఞానం లేని వారికి అనన్యభక్తి కుదరదు. జ్ఞానం కలిగి భక్తి చేస్తేనే ముక్తి సిద్ధిస్తుంది. అంతేగాని, నేను కుంతీ కుమారుణ్ణి కదా! మా అమ్మ అచ్యుతునికి మేనత్త కదా! అనుకుంటే ఫలితం సిద్ధించదు. చేసుకున్న వారికి చేసుకున్నంత. ఎవరి భక్తి వారు చేసుకోవాలి. ఎవరి ముక్తిని వారు పొందాలి. ఎవరిని వారు ఉద్ధరించుకోవాలి. మోక్ష మార్గంలో 'తన - మన' పప్పులు ఉడకవు. అందుకనే, ఈ సందర్భంలో అర్జునుని కౌంతేయా! అని సంబోధించకుండా పార్థా! అని సంబోధించాడు జగద్గురువు.

*మరణానంతరము జీవ ప్రయాణము, భిన్న మార్గాలు, ఫల విశేష భేదాలు మొదలైన విషయాలను ఇక్కడ నుండి వరుసగా నాలుగు శ్లోకాలలో చెబుతాడు.*

**యత్ర కాలే త్వనావృత్తి మావృత్తిం చైవ యోగినః ।**
**ప్రయాతా యాన్తి తం కాలం వక్ష్యామి భరతర్షభ ॥** 23

***యత్ర-కాలే-తు-అనావృత్తిం-ఆవృత్తిం-చ-ఏవ-యోగినః***
***ప్రయాతాః-యాంతి-తం-కాలం-వక్ష్యామి-భరతర్షభ***

| | | | | | |
|---|---|---|---|---|---|
| భరతర్షభ | = | అర్జునా! | కాలే | = | కాలము నందు |
| యత్ర | = | ఏ | ప్రయాతాః | = | గతించిన |
| కాలే తు | = | కాలము నందైతే | ఆవృత్తిం చ ఏవ | = | పునర్జన్మమును |
| ప్రయాతాః | = | గతించిన | యాంతి | = | పొందుచున్నారో |
| యోగినః | = | యోగులు | తం | = | ఆ |
| అనావృత్తిం | = | జన్మ రాహిత్యమును | కాలం | = | కాలమును |
| యత్ర | = | ఏ | వక్ష్యామి | = | చెబుతున్నాను |

**అర్జునా! ఏ కాలంలో మరణించిన యోగులు తిరిగి జన్మకు రారో, ఏ కాలంలో గతించిన వారు తిరిగి జన్మిస్తారో, ఆ కాల విశేషాలను చెబుతున్నాను.**

**వ్యాఖ్య**

యోగులు రెండు తెగలుగా తెలుస్తారు. ఒక తెగ వారు మోక్షమే పరమావధిగా భావించి, తదనుగుణంగా జీవించే వారు. రెండవ తెగ వారు మోక్షేతర మైన భావనతో భక్తి చేసే వారు.

మరణానంతరము మొదటి తెగ వారు తిరిగి రాని చోటికి పోతారు. రెండవ తెగ వారు తిరిగి జన్మకు వస్తారు. మరణము అందరికీ ఒకే విధంగా కనిపించినా, వారు మరణించే కాలము, మరణానంతరము వారు పయనించే మార్గము ఒకే విధంగా ఉండవు.

***క్రియా భేదాత్ ఫలభేదః*** - అనే న్యాయాన్ని అనుసరించి ఎవరు ఎలా జీవిస్తారో దానిని బట్టి వారి మరణ కాలము, మరణానంతరము వారు పయనించే మార్గము, పొందే గమ్యము నిర్దేశింప బడుతాయి. చేరే గమ్యాన్ని బట్టి వారు తిరిగి జన్మిస్తారా, లేక జన్మ రాహిత్యాన్ని పొందుతారా అనేది నిర్ణయ మౌతుంది.

ఏ కాలంలో మరణించి, ఏ మార్గం గుండా పయనించే యోగులు పునరావృత్తిని పొందరో, ఏ కాలంలో గతించి, ఏ మార్గం ద్వారా ప్రయాణాన్ని సాగించే యోగులు పునరావృత్తిని పొందుతారో భగవంతుడు చెబుతున్నాడు.





ఆత్మబంధువులారా! మరణానంతరము యోగుల పరలోక గమనాన్ని చర్చించే ఈ ప్రకరణము ఈ అధ్యాయంలో చివరి విషయము. ఇది పరలోక విషయం కావడం చేత మీమాంసతో కూడి ఉంటుంది. మనస్సు పెట్టి విచారిస్తూ అర్థం చేసుకోవలసిన అవసరం ఉంటుంది.

మానవ లోకం ఉన్నట్లే మరెన్నో లోకాలు ఉన్నాయని శాస్త్రాలు చెబుతాయి. పరలోకం అనేది ఒకటి ఉంది అని చాలా మతాలు చెబుతాయి. కాకపోతే, పరలోకం ఉందని ఒక వైపు అంగీకరిస్తూనే మరొక వైపు పునర్జన్మ లేదని కొన్ని మతాలు చెబుతాయి. బౌద్ధమతం లాంటి మతాలు కర్మ సిద్ధాంతాన్ని, పునర్జన్మమును అంగీకరిస్తూనే, మరణము - మరణానంతరము - పునర్జన్మము అనే విషయంలో మింగుడు పడని అనేక సిద్ధాంతాలను ప్రవేశ పెడతాయి.

ఈ సందర్భంలో నా దొక్క మనవి. తత్త్వశాస్త్రం జ్ఞాన ప్రధానమైంది. దానిని ప్రామాణికంగా చర్చించి నిర్ణయించ వచ్చు. కర్మ సిద్ధాంతానికి వచ్చే సరికి కొన్ని విషయాలను నమ్మవలసి వస్తుంది. నమ్మకానికి సంబంధించిన విషయాలలో కూడా కొన్నిటిని పరిశోధించి నిర్ణయించ వచ్చు. కొన్ని మాత్రం పరిశీలనకు, పరిశోధనకు అందని విషయాలుగా ఉంటాయి. అలాంటి వాటిని శ్రద్ధతో విశ్వసించాలే గాని, పిడివాదాలతో పిండి కొట్టడం సాధ్యం కాదు. కాకపోతే, అశాస్త్రీయంగా, అంధ విశ్వాసంతో హేతుబద్ధత లేని విషయాలను వివరించే మతాలకు విలక్షణంగా వేదం నమ్మకాలకు సంబంధించిన నిజాలను సహేతుకంగా వివరిస్తుంది. మహర్షులు ప్రవచించే విషయాలు, సాక్షాత్తు భగవంతుడు బోధిస్తున్న విషయం ఒకే విధంగా, సమన్వయ స్వరూపంగా గోచరిస్తున్నందున దీనిని మనం పవిత్ర ప్రసాదంగా స్వీకరించాలి. నా మట్టుకు నేను ఈ లోకాంతర గమనాన్ని వేద, పురాణ, ఇతిహాస, ఉపనిషత్తులలో చర్చింప బడిన విషయాలను స్మృతిలో ఉంచుకొని విస్పష్టంగా విశదీకరించడానికి ప్రయత్నిస్తాను. నమ్మి గాని నమ్మను స్వీకరించడంలో నష్టం లేదు. లాభమే ఉంటుంది.

*ముందుగా పునరావృత్తి లేని వారు పయనించే మార్గాలను విశదీకరిస్తున్నాడు.*

**అగ్ని ర్జ్యోతి రహః శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్ ।**
**తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ॥** 24

***అగ్నిః-జ్యోతిః-అహః-శుక్లః-షణ్మాసాః-ఉత్తరాయణం***
***తత్ర-ప్రయాతాః-గచ్ఛంతి-బ్రహ్మ-బ్రహ్మవిదః-జనాః***

| | | | | | |
|---|---|---|---|---|---|
| అగ్నిః | = | అగ్నియు | తత్ర | = | ఆ కాలము నందు |
| జ్యోతిః | = | తేజము | ప్రయాతాః | = | చనిపోయిన |
| అహః | = | పగలు | బ్రహ్మవిదః | = | బ్రహ్మవేత్త లగు |
| శుక్లః | = | శుక్లపక్షము | జనాః | = | జనులు |
| షణ్మాసాః | = | ఆరు మాసములు గల | బ్రహ్మ | = | బ్రహ్మమును |
| ఉత్తరాయణం | = | ఉత్తరాయణమును | గచ్ఛంతి | = | పొందుతున్నారు |

**అర్జునా! బ్రహ్మవేత్త లైన వారు అగ్ని, జ్యోతి, పగలు, శుక్లపక్షం, ఆరు నెలల ఉత్తరాయణం కల మార్గంలో పయనించి బ్రహ్మమును పొందుతారు.**

**వ్యాఖ్య**

**దేవయానము**

బ్రహ్మోపాసకులు పయనించే మార్గాన్ని దేవయానము అంటారు. దీనినే అర్చిరాది మార్గము, శుక్లగతి

అని కూడా అంటారు. **అర్చిః** అంటే ప్రకాశము లేదా అగ్నిజ్వాల అని అర్థము. బ్రహ్మోపాసకులు మరణానంతరము పయనించే దేవయాన మార్గము అగ్నితో ప్రారంభమై ప్రకాశవంతమైన మార్గంలో సాగుతుంది కనుక దానిని అర్చిరాది మార్గము అన్నారు. కాంతివంత మైన జ్ఞానమార్గంలో పయనించే బ్రహ్మోపాసకులు జ్ఞానానంద స్వరూపుడైన బ్రహ్మను పొందుతారు. ఈ ప్రయాణము చాలా ఆనందప్రదంగా ఉంటుంది.

మరణించిన బ్రహ్మోపాసకులు భూలోకము నుండి బ్రహ్మలోకమును చేరడానికి అంచెలంచెలుగా పయనిస్తారు. మొదట అగ్నిని, తరువాత జ్యోతిని చేరి - అలా అలా పయనించి బ్రహ్మలోకం చేరుతారు. ఇక్కడ అగ్ని అంటే అగ్ని అభిమాన దేవత అని, జ్యోతి అంటే జ్యోతి అభిమాన దేవత అని అర్థము. ఈ అభిమాన దేవతలను ఆతివాహిక దేవతలు అంటారు. ఆతివాహికులు అంటే తీసికొని పోయేవారు. **ఆతివాహికా స్తల్లింగాత్** అనే బ్రహ్మసూత్రము అగ్న్యాదులను ఆతివాహికులుగా గ్రహించ మని ప్రబోధిస్తూ ఉంది.

మరణించ గానే బ్రహ్మోపాసకుడు అగ్ని అభిమాన దేవతను చేరుతాడు. అగ్ని దేవత అతనిని తీసికొని వెళ్ళి జ్యోతి అభిమాన దేవతకు అప్పగిస్తుంది. జ్యోతి దేవత పగటి దేవతకు, పగటి దేవత శుక్లపక్ష దేవతకు, శుక్లపక్ష దేవత ఉత్తరాయణాభిమాన దేవతకు అప్పగిస్తుంది. ఈ విధంగా బ్రహ్మోపాసకుడు క్రమమార్గంలో బ్రహ్మను చేరుతాడు.

మరణించిన కాలాన్ని బట్టి, లోకాంతర గమన మార్గం నిర్ణయింప బడుతుంది కనుక **తం కాలం వక్ష్యామి.** ఆ కాలాన్ని చెబుతున్నాను అని పూర్వ శ్లోకంలో భగవానుడు చెప్పడం జరిగింది. కాని, ఆతివాహికులు ఎందరో ఉండగా కేవలం కాలాభిమాన దేవతనే దృష్టిలో ఉంచుకొని ఆ కాలాన్ని చెబుతాను అనడం సమంజస మేనా? అనే పూర్వపక్షం కూడా ఉంది.

**ఛత్రిణో గచ్ఛన్తి** - ఛత్రధారులు పోతున్నారు అన్నప్పుడు, ఆ పోయే వారందరూ ఛత్రధారులే అని అర్థం కాదు కదా! వారి మధ్య గొడుగులు లేని వారు కూడా కొందరు పోతూ ఉంటారు. కాని ఎక్కువ మంది గొడుగులు ధరించి పోతున్నారు కనుక ఛత్రధారులు పోతున్నారు అనడం జరిగింది. అలాగే ఆతివాహికులలో కాలాభిమాన దేవతలే అధికంగా ఉండటం చేత అలా కాల శబ్ద ప్రయోగం చేయడం జరిగింది.

అగ్ని మొదలైన వాటి క్రమంలో అగ్ని తరువాత జ్యోతి, జ్యోతి తరువాత పగలు అని ప్రస్తుత శ్లోకంలో ఉంది. కాని, వేదంలో అగ్ని తరువాత పగలే ఉంది గాని జ్యోతి లేదు **(తేఽ ర్చిష మభిసంభవ న్త్యర్చిషోఽ హః - శ్రుతి).** గీత శ్రుతి విరుద్ధంగా బోధించింది అనే పూర్వ పక్షం కూడా ఉంది. అది సరి యైనది కాదు. అర్చి శబ్దమునకు కాంతి అర్థమై ఉన్నందున అగ్ని, జ్యోతిస్సులు రెండూ ప్రకాశవంతములే అగుట చేత, ప్రకాశవంత మైన అగ్ని అని వేదము రెండిటిని ఒక్కటిగా గ్రహిస్తే, గీతాచార్యుడు వాటిని అగ్ని - జ్యోతి అని రెండుగా పేర్కొన్నాడు. అంతే. కనుక, గీత శ్రుతి భిన్నం కాదు.

అగ్న్యాది అభిమాన దేవతల ద్వారా దేవయానంలో, లేదా అర్చిరాది మార్గంలో ప్రయాణం చేసిన బ్రహ్మోపాసకులు బ్రహ్మలోకము చేరే ముందు 'విరజ' నదిని దాటుతారు అని ఉపనిషత్తులో ఉంది. 'విరజ' **(విగతరజస్)** అంటే విడిచిన రజోగుణము కలది అని అర్థము. ఉపాసకులు తమలో మిగిలి ఉన్న రజోగుణాన్ని విరజ నదిలో విడిచేస్తారు. తమోగుణము మరణానికి ముందే నశించి ఉంటుంది కనుక, కేవలం సత్త్వగుణ ప్రధానులై బ్రహ్మలోకంలో ప్రవేశిస్తారు. ప్రళయ కాలము ప్రాప్తించు వరకు బ్రహ్మలోకము లోనే ఉండి, చతుర్ముఖ బ్రహ్మ వద్ద బోధను గ్రహించి, పూర్ణజ్ఞానులై, ప్రళయ కాలంలో పరమేశ్వర స్వరూపాన్ని పొందుతారు.

మరణానంతరము అర్చిరాది మార్గము గుండా బ్రహ్మలోకమును చేరిన వారిని బ్రహ్మవిదులు అన్నాడు





గీతాచార్యుడు. ఇక్కడ బ్రహ్మవిదులు అంటే బ్రహ్మజ్ఞానులు అని అర్థం కాదు. బ్రహ్మోపాసకులు అని అర్థం. 'ఓం' అనే ఏకాక్షర బ్రహ్మమును ఉపాసించిన వారు (8 - 13). లేదా సగుణ బ్రహ్మోపాసకులు అని అర్థం.

బ్రహ్మజ్ఞాని జీవన్ముక్తుడు. అతడు జీవించి ఉన్నప్పుడే ముక్తుడు అయినందున అతడు ఇక్కడే బ్రహ్మమై ఉన్నాడు **(అత్ర బ్రహ్మ సమశ్నుతే).** జీవన్ముక్తుడు జీవించి ఉండగానే శరీరత్రయాన్ని నశింప చేసుకున్నాడు. ఇక ప్రయాణించడానికి అతనికి సూక్ష్మదేహ మెక్కడుంది? కనుక జ్ఞానులకు ప్రాణోత్క్రమణము లేదు. **న తస్య ప్రాణా ఉత్క్రామన్తి** అని శ్రుతి నిర్ణయము.

కనుక ప్రకృష్ట మైన, ప్రకాశవంత మైన పవిత్ర మార్గం దేవయానము, లేదా అర్చిరాది మార్గము. ఇది ఉత్తరాయణ పుణ్య కాలము. మకర సంక్రమణం నుండి ఆరు మాసాలు సూర్యుడు ఉత్తరంగా పయనిస్తాడు కనుక అది ఉత్తరాయణము. జ్యోతిర్మార్గము. దేవయానము. పునరావృత్తి లేని మార్గము.

**క॥ పునరావర్తన రహితుం డనఘా పరమాత్ము జెంది నట్టి పురుషుండ**
**వినుతావస్థను మోక్షం బని చెప్పుదు రంత కంటె నధికము గలదే॥**

అని మహాభారతము - శాంతిపర్వములో తిక్కనార్యుని అందమైన కందము.

ఇక పితృయాణ మార్గాన్ని గూర్చి చెబుతాడు.

ధూమో రాత్రి స్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్ ।
తత్ర చాన్ద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే ॥ 25

**ధూమః-రాత్రిః-తథా-కృష్ణః-షణ్మాసాః-దక్షిణాయనం**
**తత్ర-చాంద్రమసం-జ్యోతిః-యోగీ-ప్రాప్య-నివర్తతే**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ధూమః | = | ధూమము | యోగీ | = | యోగి |
| రాత్రిః | = | రాత్రి | తత్ర | = | ఆ మార్గము నందు |
| తథా | = | అలాగే | చాంద్రమసం | = | చంద్ర సంబంధమైన |
| కృష్ణః | = | కృష్ణపక్షము | జ్యోతిః | = | జ్యోతిని |
| షణ్మాసాః | = | ఆరు మాసములు గల | ప్రాప్య | = | పొంది |
| దక్షిణాయనం | = | దక్షిణాయనము | నివర్తతే | = | పునర్జన్మము నెత్తుచున్నాడు |

**అర్జునా! ఫలాసక్తి గల కర్మయోగి ధూమము, రాత్రి, కృష్ణ పక్షము, ఆరునెలల దక్షిణాయనము కల మార్గంలో పయనించి, చంద్రకాంతి వంటి స్వర్గాన్ని పొంది, తిరిగి జన్మిస్తాడు.**

**వ్యాఖ్య**

**పితృయాణము**

ఫలాపేక్షతో సకామ కర్మలను ఆచరించిన యోగులు మరణానంతరము పయనించే మార్గాన్ని పితృయాణము అంటారు. ఇది ధూమాది మార్గము. బ్రహ్మోపాసకులది అర్చిరాది మార్గము కనుక కాంతివంతంగా ఉంటుంది. వీరిది ధూమాది మార్గం కనుక పొగసూరి ఉంటుంది. వీరి మార్గ మంతా ధూమము, రాత్రి, కృష్ణ పక్షము - ఇలా అంధకారంతో నిండి ఉంటుంది.

దేవయాన మార్గంలో అగ్న్యాదులను అభిమాన దేవతలుగా ఎలా గ్రహించామో ఇక్కడ కూడా ధూమాదులను అభిమాన దేవతలుగా గ్రహించాలి. **ధూమః** అంటే ధూమాభిమాన దేవత, **రాత్రిః** అంటే రాత్రి

అభిమాన దేవత, **కృష్ణః** అంటే కృష్ణపక్షాభిమాన దేవత, షణ్మాస రూప దక్షిణాయన అభిమాన దేవత. పితృయాణ మార్గంలో వీరే ఆతివాహిక దేవతలు.

**అథయే యజ్ఞేన దానేన తపసా లోకాన్ జయన్తి తే ధూమ మభి సంభవన్తి।**

యజ్ఞము, దానము, తపస్సు నాచరించిన వారు ధూమ మార్గము ననుసరించి పయనిస్తారు అన్నది బృహదారణ్యకోపనిషత్తు *(8 - 2 - 15).* అగ్నిహోత్రాది కర్మ లాచరించే వారు, ఇష్టాపూర్త దత్తాది కర్మల్ని ఆచరించే వారు పితృయాణములో పయనిస్తారు. యజ్ఞయాగాదులు ఇష్టము లైతే, వాపీ కూప తటాకాది నిర్మాణాలు పరోపకారార్థం చేయడం పూర్తములు. ఇక దత్తాదు లంటే దానకర్మలు అని అర్థము. నేటి కాల పరిస్థితులను అనుసరించి చెప్పాలంటే, ఉచిత విద్యాలయాలు, ఉచిత వైద్యశాలలు, అనాథ శరణాలయాలు, ఉచిత త్రాగునీటి పథకాలు - ఇవన్నీ దత్తాదుల క్రిందికే వస్తాయి. గో సువర్ణ వస్త్ర అన్న దానాదులు కూడా దత్తాది కర్మలే.

ఈ విధమైన సకామ కర్మయోగులు మరణించ గానే సూక్ష్మ శరీరధారులై పయనించి ధూమాభిమాన దేవతను చేరుతారు. ధూమాభిమాన దేవత రాత్రి అభిమాన దేవతను, రాత్రి అభిమాన దేవత కృష్ణ పక్షాభిమాన దేవతను, కృష్ణ పక్షాభిమాన దేవత దక్షిణాయనాభిమాన దేవతను చేరడం జరుగుతుంది. అక్కడ నుండి చంద్రలోకాన్ని చేరుతారు. ఇది పితృయాణ ఆరోహణ క్రమము.

సకామ కర్మయోగులు చంద్ర లోకంలో జలమయ దేహాలను ధరించి దివ్యమైన భోగాలను అనుభవిస్తారు. చంద్ర లోకంలో జ్యోతిని పొందుతారు ***(తత్ర చాన్ద్రమసం జ్యోతిః ప్రాప్య).*** ఇక్కడ జ్యోతిస్సు అంటే కర్మఫలం. యోగి ఆచరించిన పుణ్య కర్మఫలం. దానిని అనుభవించి, కొద్దిగా పుణ్యఫలం మిగిలి ఉండగానే తిరిగి భూ లోకానికి ప్రయాణ మవుతారు. అంటే, పుణ్యఫలం పూర్ణంగా అనుభవించకుండా కొంత మిగుల్చుకొని తిరిగి వస్తాడా? అవును. శాస్త్రం అలాగే చెప్పింది. ఈ విషయాన్ని బ్రహ్మసూత్రాలలో బాదరాయణుడు కూడా ధృవపరచాడు.

***కృతాత్యయేఽ నుశయవాన్*** - చంద్ర లోకంలో పుణ్యకర్మ క్షయ మైనపుడు ***(కృతాత్యయే)*** మిగిలిన పుణ్యఫలముతో క్రిందికి దిగుతున్నాడు ***(అనుశయవాన్)*** అని బ్రహ్మసూత్రము. అంటే, మిగిలిన పుణ్య ఫలాన్ని అనుశయము అంటారు.

మనం విహార యాత్రగా కాశ్మీరానికో, కొడైకెనాల్‌కో వెళ్తాం. ఆ యాత్రకు అవసరమైన ధనాన్ని తీసికొని పోతాం. ఆ ధనాన్ని మనం ఎంత స్వేచ్ఛగా ఖర్చు పెట్టుకున్నా, తిరుగు ప్రయాణానికి కొంత ప్రక్కన పెడతామా, లేదా? అదే అనుశయము అంటే. మొత్తం ఖర్చు పెట్టేస్తే తిరిగి వచ్చే దెలా? పితృయాణ మార్గంలో పయనించిన సకామ యోగులు చంద్రలోకంలో పుణ్యఫలాన్నంతా అనుభవించేస్తే, తిరిగి జన్మకు ఎలా వస్తారు? మిగిలిన పుణ్యం తోనే రావాలి. మరో దారి లేదు. ఆ మిగిలిన పుణ్యమే అనుశయము.

**తిరోగమనము**

పితృయాణ మార్గము పునరావృత్తి కలదిగా ముందే తెలుసుకొని ఉన్నాము. చంద్రలోకము నుండి తిరిగి భూ లోకానికి చేరడానికి కూడా ఈ కృష్ణగతి మార్గంలో అవరోహణ క్రమం ఉంది. ఈ ప్రయాణ వివరాలను ఛాందోగ్య బృహదారణ్యకాలు స్వల్ప భేదంతో అభివర్ణించాయి.

***ఆకాశా ద్వాయుం వాయోర్వృష్టిం వృష్టిః పృథివీం ప్రాప్య అన్నం భవన్తి। తే పునః పురుషాగ్నౌ హూయన్తే తతో యోషాగ్నౌ జాయన్తే తే లోకాన్ప్రత్యుత్థాయినః***





తిరోగమనంలో, అంటే చంద్రలోకం నుండి భూలోకానికి తిరిగి పయనించే అవరోహణ క్రమంలో ప్రథమంగా చంద్రలోకం నుండి ఆకాశానికి చేరి, అక్కడ వాయువుతో కలిసి మేఘంలో ప్రవేశిస్తాడు. మేఘము నుండి వర్ష రూపంలో భూమికి దిగి, భూలోకములో ఓషధులను ఆశ్రయించుకొని కొంత కాలం సూక్ష్మంగా ఉంటాడు ***(అన్నం భవన్తి!).*** ఆ అన్నమును పురుషుడు భుజించ గానే పురుషునిలో ప్రవేశించి వీర్య రూపమున ఉంటాడు. పురుషుని నుండి స్త్రీ గర్భంలో ప్రవేశించి దేహాన్ని ధరిస్తాడు. ఇది అవరోహణ క్రమము.

దేవయానము గుండా ఉత్తరాయణంలో పయనించిన వారు బ్రహ్మలోకాన్ని చేరి, బ్రహ్మ సన్నిధిలో శ్రవణం చేసి క్రమముక్తిని పొందుతారు. వారు పునరావృత్తి నెరుగరు. అంటే తిరిగి భూలోకంలో జన్మించరు.

పితృయాణ మార్గంలో దక్షిణాయనమున పయనించిన వారు చంద్రలోకం చేరి, పుణ్య ఫల భోగాలను అనుభవించి, పుణ్యఫలం క్షీణించ గానే, దారి బత్తెమునకు కొంత మిగుల్చుకొని తిరిగి భూలోకంలో జన్మిస్తారు. వారికి పునరావృత్తి ఉంటుంది. అంటే, తిరిగి వారు భూలోకంలో జన్మిస్తారు.

*ఈ శుక్ల కృష్ణ గతులను సంక్షేపంగా చెబుతున్నాడు.*

**శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతః శాశ్వతే మతే ।**
**ఏకయా యా త్యనావృత్తి మన్య యావర్తతే పునః ॥** 26

**శుక్లకృష్ణే-గతీ-హి-ఏతే-జగతః-శాశ్వతే-మతే**
**ఏకయా-యాతి-అనావృత్తిం-అన్యయా-ఆవర్తతే-పునః**

| | | | | | |
|---|---|---|---|---|---|
| శుక్లకృష్ణే | = | శుక్లకృష్ణము లైన | ఏకయా | = | ఒక మార్గముచే |
| ఏతే | = | ఈ | అనావృత్తిం | = | జన్మరాహిత్యమును |
| గతీ హి | = | గతులు | యాతి | = | పొందుతాడు |
| జగతః | = | జగత్తునకు | అన్యయా | = | రెండవ మార్గముచే |
| శాశ్వతే | = | శాశ్వతములని | పునః | = | తిరిగి |
| మతే | = | భావింపబడు తున్నాయి | ఆవర్తతే | = | జన్మిస్తాడు |

**అర్జునా! శుక్ల గతి, కృష్ణ గతి - ఈ రెండూ జగత్తులో శాశ్వతంగా ఉన్నాయి. ఒక దాని వల్ల జన్మ రాహిత్యం జరిగితే, మరొక దాని వల్ల పునర్జన్మ ప్రాప్తిస్తుంది.**

**వ్యాఖ్య**

జగన్నాటక మంతా రాత్రింబవళ్ళతో సాగి పోతోంది. జీవితం వెలుగు నీడల సంగమంగా తెలుస్తోంది. చీకటి వెలుగులు ఈ ప్రపంచంలో అనాదిగా ఉన్నాయి. ప్రవాహ రూపంగా సాగుతున్నాయి.

జగత్తు అనే రంగస్థలి ఉన్నంత వరకు జీవనాటకం లేదా జీవితనాటకం నడుస్తూనే ఉంటుంది. సంసారం ఎప్పటి నుండో ఉంది. అనాదిగా ఉంది. అందుచేతనే సంసారానికి సంబంధించిన శుక్ల కృష్ణ గతులు కూడా అనాదిగా ఉన్నాయి ***(గతీ శాశ్వతే నిత్యే సంసారస్య నిత్యత్వాత్).*** ఉపాసకులు, కర్మపరులు - వీరిరువురు ఉన్నంత వరకు ఈ రెండు మార్గాలూ ఉంటాయి. ఒక మార్గం ఊర్ధ్వంగా నడిపిస్తే, మరొక మార్గం పతనానికి దారి తీస్తుంది.

దేవయాన మనే ఉత్తరాయణం కాంతి మయమైంది. జ్ఞానరూప మైంది. పగలు వెలిగినట్లు ప్రకాశిస్తుంది. అర్చిరాది మార్గము. జన్మకు రాకుండా నివారిస్తుంది. మోక్షాన్ని పొందేలా చేస్తుంది. కనుకనే అది శుక్లగతి.

పితృయాణ మనే దక్షిణాయనం ధూమాయతంగా ఉంటుంది. జ్ఞాన రహితంగా ఉంటుంది. రాత్రి లాగా చీకట్లు ముసురుకొని ఉంటుంది. పునర్జన్మను కలిగిస్తుంది. బంధానికి హేతు వవుతుంది. కనుకనే అది కృష్ణగతి. ధూమాది మార్గము.

***కర్మణా పితృలోకో విద్యయా దేవలోకః -*** కర్మ చేత పితృయాణ మార్గము ప్రాప్తిస్తే, జ్ఞానం చేత దేవయాన మార్గం సిద్ధిస్తుంది. చీకటి దారి ఎప్పుడైనా, ఎక్కడైనా, ఎవరి కైనా దుఃఖాన్నే కలిగిస్తుంది. వెలుగుల దారిలో వెలుగులే ఉంటాయి. వెతలు అదృశ్య మవుతాయి. ఏ మార్గాన్ని త్యజించాలో, దేనిని అనుసరించాలో విజ్ఞులే నిర్ణయించుకోవాలి. ఎవరికి వారు విచారంలో విజ్ఞులు కావాలి. మోహం నుండి విడిపడాలి. మోక్షాన్ని పొంది తరించాలి.

*చివరగా భగవంతుడు దీనినే సందేశంగా అనుగ్రహిస్తున్నాడు.*

నైతే సృతీ పార్థ జాన న్యోగీ ముహ్యతి కశ్చన ।
తస్మా త్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున ॥ 27

***న-ఏతే-సృతీ-పార్థ-జానన్-యోగీ-ముహ్యతి-కశ్చన***
***తస్మాత్-సర్వేషు-కాలేషు-యోగయుక్తః-భవ-అర్జున***

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ | = | అర్జునా! | తస్మాత్ | = | అందువలన |
| ఏతే | = | ఈ రెండు | సర్వేషు | = | సమస్తమైన |
| సృతీ | = | మార్గములను | కాలేషు | = | కాలముల యందు |
| జానన్ | = | తెలిసిన | అర్జున | = | అర్జునా! |
| యోగీ | = | యోగి | యోగయుక్తః | = | యోగయుక్తుడవు |
| కశ్చన | = | ఎవడును | భవ | = | కమ్ము! |
| న ముహ్యతి | = | మోహము నొందదు | | | |

**అర్జునా! ఈ రెండు మార్గాలను తెలిసిన వాడు మోహమును పొందడు. అందుచేత, అన్ని కాలాలలో యోగయుక్తుడవై ఉండు.**

**వ్యాఖ్య**

### గమ్యాలు - గమనాలు

అష్టమాధ్యాయ మైన అక్షర పరబ్రహ్మ యోగము ముగింపు దశకు చేరుకున్నాం. ఈ అధ్యాయం లోని ప్రత్యేక సాధన సాధ్యాలను అర్థం చేసుకున్నాం. సింహావలోకనం చేసుకొంటే, ప్రధానంగా నాలుగు రకాలైన వ్యక్తులు మన మనస్సులో మెదుల్తారు. జీవితంలో వ్యక్తులు సాధించే గమ్యాలను, వారికి ప్రాప్తించే గతులను దృష్టిలో ఉంచుకొని, నాలుగు విధాలుగా వారిని విభజించు కుంటున్నాము.

మొదటి వారు లౌకికులు. విషయ వాసనాపరులు. భోగాసక్తులు. స్వార్థమే గాని పరార్థం పట్టని వారు. పరమార్థం గిట్టని వారు. వీరికి కడుపే కైలాసం - కొంపే కైవల్యం. జీవిత మేమిటో, జీవిత గమ్య మేమిటో పొరపాటున కూడా ఆలోచించని వారు. ఇలాంటి అభాగ్యులు చస్తూ పుడుతూ, పుడుతూ చస్తూ జనన మరణ చక్రంలో పరిభ్రమిస్తూ ఉంటారు. వీరికి అంతరించే ఉబలాటమే గాని తరించే ఉపాయము తెలియదు. ఎక్కువ శాతం ప్రపంచంలో వీరే.





రెండవ వారు మహాత్ములు. వీరే జీవన్ముక్తులు. బ్రహ్మాత్మ జ్ఞానం కలిగిన వారు. స్థిరమైన జ్ఞానము కలవారు. నిత్యానంద స్వరూపులు. వీరికి ప్రపంచము విస్మృత ప్రాయము. దేహము ఛాయ వంటిది. అంతటా వీరికి బ్రహ్మ దర్శనమే. వీరు కృతకృత్యులు. ఆప్తకాములు. సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపులు. జీవించి ఉండగనే సూక్ష్మ కారణ దేహాలను నశింప చేసుకున్న వారు. మృత్యువు నెరుగరు. కనుక లోకాంతర గమనము, పునర్జన్మము వీరి విషయంలో అర్థ రహితము. వీరి దర్శనమే భగవద్దర్శనము. ఇలాంటి వారు ఎక్కడో అరుదుగా ఉంటారు.

మూడవ వారు ముముక్షువులు. మోక్షమే పరమావధిగా కలిగి ఉంటారు. కామ్యకర్మల జోలికి పోరు. బ్రహ్మోపాసనలో జీవిస్తూ ఉంటారు. లేదా, సగుణ బ్రహ్మ ధ్యానంలో రమిస్తూ ఉంటారు. వీరికి అంతఃకరణ శుద్ధి ఉంటుంది. సాధన సాగుతూ ఉంటుంది. కాని జీవితంలో జీవన్ముక్తుల లాగా మోక్షాన్ని పొందలేక పోతారు. ఇలాంటి వారు మరణించిన తరువాత ఉత్తరాయణంలో దేవయాన మార్గం గుండా బ్రహ్మలోకం చేరి, అక్కడ బ్రహ్మ సన్నిధిలో జ్ఞానోపదేశమును అందుకొని, ప్రళయ కాలంలో బ్రహ్మతో సహ పరమేశ్వర ప్రాప్తిని పొంది తరించి పోతారు. వీరికి పునరావృత్తి ఉండదు. పునర్జన్మ ఉండదు.

నాల్గవ వారు సకామ యోగులు. వీరికి కర్మలలో ఫలాపేక్ష ఉంటుంది. యజ్ఞ యాగాదులు నిర్వహిస్తారు. పరోపకారార్థం అనేక ఇష్టాపూర్త కర్మలు ఆచరిస్తారు. దాన ధర్మాలు చేస్తారు. భోగాసక్తి పరులైన వీరు మరణానంతరం దక్షిణాయనంలో పితృయాణ మార్గం గుండా పయనించి చంద్రలోకం చేరుతారు. అక్కడ పుణ్యఫల భోగాలను అనుభవించిన తరువాత తిరిగి మానవ లోకానికి వస్తారు. వీరికి పునరావృత్తి ఉంటుంది. పునర్జన్మ ఉంటుంది. వీరు మొదటి వారి లాగా బ్రతుకును అన్యాయం చేసుకోరు. అలాగని రెండు, మూడవ కోవల లోని వారి లాగా తరించరు.

సంక్షేపంగా చెప్పుకుంటే (1) మహాత్ములు లేక జీవన్ముక్తులు దేహము ఉండగానే తరించి పోతారు. (2) ముముక్షువులు లేక బ్రహ్మోపాసకులు మరణానంతరము బ్రహ్మలోకంలో క్రమముక్తిని పొందుతారు. (3) సకామ యోగులు మోక్ష స్పృహ లేక ఫలాకాంక్షతో స్వర్గాది లోకాలలో భోగాలను అనుభవించి మళ్ళీ జనన మరణాల ఊబిలో పడుతూ ఉంటారు. (4) ఇక లౌకికు లంటారా! పురుషార్థం లేక, పరమార్థం తెలియక, అర్థరహితంగా జీవిస్తూ, జన్మలను వ్యర్థం చేసుకుంటూ, భూమికి భారంగా, గాలికి అడ్డంగా చరిస్తూ ఉంటారు. ఈ నాలుగు విధాలైన వ్యక్తులలో మన మేమిటో, ఎక్కడున్నామో తెలుసుకొని, ఆ తరువాత ఏది శ్రేయస్సో నిశ్చయించుకొని, తదనుగుణంగా జీవించాలి. అలా జీవించే వారెవ్వరూ మోహానికి గురి కారు.

### మోహము - మోక్షము

జన్మ రాహిత్యము - జన్మ సాఫల్యము తెలియక కేవలం జన్మల చుట్టే పరిభ్రమించే లౌకికులు గాని, సకామ యోగులు గాని మోహ ఊబిలో కూరుకు పోయిన వారే. వారిని ప్రక్కన పెడితే, జ్ఞానులు, బ్రహ్మోపాసకులు వీరిరువురే మోక్షరూపులు. మోహం చెందని వారు.

మరణించక ముందే తరించే వారు జ్ఞానులు. మరణించిన తరువాత తరించే వారు ముముక్షువు లైన ఉపాసకులు. బ్రతికినా చచ్చినా తరించని వారు లౌకికులు మరియు సకాములు.

దేవయాన పితృయాణ మార్గాలను ముందుగానే తెలుసుకున్న వారు మోహానికి గురి కారు అంటున్నాడు భగవంతుడు. ఇందులో ఒకటి మోక్షానికి, రెండవది మోహానికి దారి తీస్తుందన్న వివేకాన్ని కలిగించి మోహాన్ని నివారిస్తుంది. మోహము మోక్షానికి విరుద్ధం అని తెలిసిన తరువాత మోహంలో ఎవరైనా ఎందుకు పడతారు?

***(జానన్ సంసారాయ ఏకా, అన్యా మోక్షాయ చ ఇతి యోగీ న ముహ్యతి).*** మోహంలో ఎవడు పడడో వాడే సమాహిత చిత్తుడైన యోగి.

**యోగము - యోగ్యము**

ఇంత చెప్పిన తరువాత, చివరగా అర్జునా! యోగయుక్తుడవు కా! అంటున్నాడు భగవంతుడు ***(యోగ యుక్తో భవ!).*** ఇక్కడ యోగి అంటే జ్ఞానయోగి. జీవన్ముక్తికై యత్నించే పుణ్యాత్ముడు. మోక్షమే పరమావధిగా గలవాడు. మోక్షం జ్ఞాన రూపంలో ఉంది అనే నిశ్చయమైన వివేకం కలవాడు.

క్రమ ముక్తికి సంబంధించిన బ్రహ్మలోక విషయాన్ని ప్రక్కన పెడితే, మోక్ష మనేది లోకాలలో లేదు అని తెలిసిన వాడు ముముక్షు యోగి. మోక్షము ఎక్కడో, ఎప్పుడో దొరికేది కాదు. జ్ఞాన స్ఫూర్తితో అవలోకిస్తే ఇక్కడే, ఇప్పుడే ప్రాప్తించేది అనే వివేకం దృఢంగా కలవాడు.

జీవించి యుండగానే మోక్షాన్ని పొందడము జీవన్ముక్తి. మరణించిన తరువాత బ్రహ్మలోకంలో మోక్షాన్ని పొందడము క్రమముక్తి. నేడు లభించే దానిని రేపటికి వాయిదా వేసుకొని సాధించే ఫాయిదా ఏమిటి? కనుకనే మోహానికి గురి కాకుండా జీవన్ముక్తిని పొందే ప్రయత్నంలో యోగివి కమ్మని గీతాచార్యుడు ఉపదేశిస్తున్నాడు.

అంతఃకరణ శుద్ధిని పొందటానికి ముముక్షువు ముందు కర్మయోగి కావాలి. చిత్తశుద్ధి కలిగిన తరువాత శ్రవణ మనన నిదిధ్యాసల ద్వారా సదా బ్రహ్మ చింతనలో ఉండే జ్ఞానయోగి కావాలి. ఇక్కడ 'యోగి' శబ్దానికి ఇదే తాత్పర్యం. ఈ బ్రహ్మ చింతనము కూడా సర్వకాల సర్వావస్థల యందు సాగాలి అంటున్నాడు ***(సర్వేషు కాలేషు యోగ యుక్తః భవ!).*** అంటే, సాధకుడు సదా అప్రమత్తంగా ఉండాలి అని అర్థం. అశన శయన ఆసనాదుల యందు సైతము బ్రహ్మ చింతనమే సాగేటట్లు చూసుకోవాలి. ఎక్కడ అప్రమత్తత లోపించినా కాలు జారే ప్రమాద ముంది. జారడం అంటూ జరిగితే పడేది మాత్రం మోహం లోనే. అందుకనే సదా యోగయుక్తులై ఉండాలి.

*చివరగా అధ్యాయ ఫలశ్రుతిని వినిపిస్తున్నాడు.*

**వేదేషు యజ్ఞేషు తపఃసు చైవ దానేషు య త్పుణ్యఫలం ప్రదిష్టమ్ ।**
**అత్యేతి తత్సర్వ మిదం విదిత్వా యోగీ పరం స్థాన ముపైతి చాద్యమ్ ॥** 28

***వేదేషు-యజ్ఞేషు-తపఃసు-చ-ఏవ-దానేషు-యత్-పుణ్యఫలం-ప్రదిష్టం***
***అత్యేతి-తత్-సర్వం-ఇదం-విదిత్వా-యోగీ-పరం-స్థానం-ఉపైతి-చ-ఆద్యం***

| | | | | | |
|---|---|---|---|---|---|
| **యోగీ** | = | యోగి | ప్రదిష్టం | = | చెప్ప బడినదో |
| **ఇదం** | = | దీనిని | తత్ | = | ఆ |
| **విదిత్వా** | = | గ్రహించి | సర్వం | = | సర్వమును |
| **వేదేషు** | = | వేదముల యందు | అత్యేతి | = | అతిక్రమించు చున్నాడు |
| **యజ్ఞేషు** | = | యజ్ఞముల యందు | ఆద్యం | = | మొదటి దైనది |
| **తపఃసు** | = | తపముల యందు | పరం | = | ఉన్నత మైనది |
| **దానేషు చ ఏవ** | = | దానముల యందు గూడ | స్థానం | = | స్థానమును |
| **యత్** | = | ఏ | ఉపైతి చ | = | పొందుతాడు |
| **పుణ్యఫలం** | = | పుణ్యఫలము | | | |





**అర్జునా! ఇది అర్థమైన యోగి వేదాల వల్ల, యజ్ఞాల వల్ల, తపస్సుల వల్ల కలిగే పుణ్య ఫలాన్ని విడిచి పెట్టేస్తాడు. శ్రేష్ఠ మైన స్థానాన్ని పొందుతాడు.**

**వ్యాఖ్య**

**ఫలప్రాప్తి**

నదిని దాటితేనే తీరం వస్తుంది. పుణ్యపాపాలను అధిగమిస్తేనే మోక్షం ప్రాప్తిస్తుంది. అకృత్యాలు పాపాలైతే, సత్కృత్యాలు పుణ్యాలు. పుణ్యాలు చేసే పుణ్యాత్ములు పుణ్య ఫలాలను పొందుతారు. పుణ్య ఫలాలను ఈ లోకంలో అనుభవించడమే గాక, పుణ్య లోకాల లోను అనుభవిస్తారు. ఏ పుణ్యమైనా అనుభవంలో క్షయించేదే కనుక, పుణ్యఫలాలు, తద్వారా లభించే పుణ్య లోకాలు పరిమిత ఫలాలై నశించి పోతాయి. మనిషి ఆశించే అనంత ఫలం పుణ్యం వల్ల ప్రాప్తించేది కాదు. జ్ఞానం వల్లనే సిద్ధిస్తుంది. ఈ సత్యాన్ని దర్శించిన వాడు పుణ్యాన్ని కూడా అతిక్రమించి జ్ఞానాన్ని పొంది, పరమోత్కృష్ట మైన మోక్షాన్ని పొందుతాడు.

పుణ్య మనేది (1) వేదాధ్యయనం వలన, వైదిక కర్మానుష్ఠానం వలన లభిస్తుంది **(వేదేషు సమ్యక్ అధీతేషు).** (2) యజ్ఞానుష్ఠానం వల్ల, అశ్వమేధాది యజ్ఞాచరణము వల్ల ప్రాప్తిస్తుంది **(యజ్ఞేషు చ సాద్గుణ్యేన అనుష్ఠితేషు).** తపస్సుల వలన, కృచ్ఛ్ర చాంద్రాయణాది వ్రతాల వలన సిద్ధిస్తుంది **(సు తప్తేషు).** అలాగే దానాది క్రియలు - గోదానాది షోడశ మహాదానాల వలన కూడా ప్రాప్తిస్తుంది **(దానేషు చ సమ్యక్ దత్తేషు).** ఈ విధంగా శాస్త్రోక్త మైన పుణ్య కర్మలకు పుణ్యఫలాలు ప్రాప్తిస్తాయి. ఇవన్నీ నైమిత్తిక సుఖ ప్రాప్తులే గాని నిత్య సుఖప్రాప్తి హేతువులు కావు. వీటిని దాటిన వారే మనస్సును మోక్ష మార్గంలో నిలుప గలరు. నదిని దాటితేనే తీరము. పుణ్య ఫల ప్రవాహాన్ని అధిగమిస్తేనే మోక్షము.

**ఆఖ్యాయిక**

కృష్ణదాసు గొప్ప భక్తుడు. ఏకాంత భక్తుడు. కర్మయోగి. సదా శ్రీకృష్ణ ధ్యానామృత పానచిత్తుడు. సంసార పోషణకు చిన్న ఉద్యోగాన్ని చేస్తూ ధర్మబద్ధంగా, సమాహిత చిత్తుడై ప్రశాంతంగా జీవించే వాడు.

భక్తుడైన కృష్ణదాసులో గొప్ప చిత్రకారుడు కూడా ఉన్నాడు. తీరిక సమయాలలో శ్రీకృష్ణ పరమాత్మ జీవిత విశేషాలను ప్రతిబింబించే ఘట్టాలను చిత్రీకరించే వాడు. అలా బొమ్మలను చిత్రించి, తన చిత్రాలను అభిమానించే తన పొరుగింటి స్నేహితునికి ఫలాపేక్ష లేకుండా ఇచ్చేసేవాడు.

ఈ విధంగా అద్భుతమైన కొన్ని వందల వర్ణ చిత్రాలను కృష్ణదాసు రూపొందించాడు. అలా బొమ్మలను గీస్తూ ఆత్మానందాన్ని అనుభవిస్తూ అజ్ఞాతంగా ఉండిపోయాడు.

కృష్ణదాసు చిత్రాలను గ్రహించిన పుణ్యాత్ముడు వాటిని చక్కని చట్రములలో బిగించి, ఉదారులైన కొందరు భక్తుల సహకారంతో 'కృష్ణదాసు చిత్ర కళా ప్రదర్శన' అనే దానిని ఒకటి ఏర్పాటు చేశాడు.

ఆ చిత్రకళా ప్రదర్శనాన్ని తిలకించి కళారాధకులు పరవశించి పోయారు. ప్రతిరోజు వేలాది సంఖ్యలో వచ్చి దర్శించి సంతసించారు.

ఇంతకీ, ఈ అద్భుత కళాకారుడు ఎవరు? ఏ ప్రాంతం వాడు? ఎక్కడ ఉంటాడు? అని సందర్శకులు ప్రశ్నించే వారు. ఈ ప్రదర్శనమును ఏర్పాటు చేసిన కృష్ణదాసు స్నేహితుడు మాత్రం ఆ వివరాలను రహస్యం గానే ఉంచాడు.

నెలరోజులు పూర్తి అయ్యాయి. చిత్ర కళా ప్రదర్శన వైభవము దేశమంతా వ్యాపించింది.

తండోపతండాలుగా జనం వచ్చి దర్శిస్తున్నారు. అసమాన ప్రతిభావంతు డైన ఆ చిత్రకారుని చూడాలనే ఉత్సాహము, ఉత్కంఠ జనంలో పెరిగి పోయింది. ప్రదర్శనమును ఏర్పాటు చేసిన వ్యక్తే చిత్రకారుడేమో అనే అనుమానాన్ని కూడా కొందరు వ్యక్తం చేయసాగారు. చివరికి కళారాధకు లంతా పెద్ద సంఖ్యలో వచ్చి, 'తాతయ్యా! ఇవన్నీ మీరు గీసిన బొమ్మలే కదూ?' అని అడిగారు. సత్యాన్ని అంగీకరించ మని, అతనిని సన్మానించే భాగ్యాన్ని తమకు ప్రసాదించ మని ప్రార్థించారు. పట్టుబట్టి మరీ కూర్చున్నారు.

ఇక చెప్పక తప్పింది కాదు. 'నాయనా! నిజం చెప్తున్నాను. ఈ బొమ్మలను గీసిన చిత్రకారుణ్ణి నేను కాను. నా భాగ్యం కొద్దీ అవి నాకు లభించాయి. వీటిని చిత్రీకరించిన అసమాన కళాకారుడు మన నగరం లోనే అజ్ఞాతంగా ఉన్నాడు. ఆయన హృదయం సదా కృష్ణ చైతన్యంతో నిండి ఉంటుంది.

ఈ చిత్రాలన్నీ ఆయన తృప్తి కొరకు ఈశ్వర ప్రీత్యర్థం గీసుకున్నవే. ఫలాపేక్ష తెలియని ఆ మహాత్ముడు, తన హృదయంలో కదిలే భక్తి భావాలకు రూపం దిద్దుతూ, వేసినవి వేసినట్లు మారు ఆశించకుండా నాకు ఇచ్చేసే వాడు. అలా అయిదు దశాబ్దాలు గడిచాయి. అవి ఏమయ్యాయి? అని ఏనాడూ అతడు నన్ను అడగలేదు. నేను వాటిని ఈ యాభై సంవత్సరాలు భక్తితో, శ్రద్ధతో రక్షించుకుంటూ వచ్చాను. పేదనైన నేను ఈ నాటికి ఉదారుల సహకారంతో వాటిని చట్రాలలో అమర్చి ఈ ప్రదర్శనను ఏర్పాటు చేయ గలిగాను' అన్నాడు ప్రదర్శనమును ఏర్పాటు చేసిన కృష్ణదాసు స్నేహితుడు. అందరూ ఆశ్చర్యపోయారు.

చిత్రకారుణ్ణి చూపించ మని కళాప్రపంచం ఉవ్వెత్తున లేచింది. 'అయ్యా! మీ అందరికీ నమస్కారాలు. ఫలాపేక్ష లేకుండా ఈశ్వరార్చనగా ఈ కళారూపాలను సృష్టించిన ఆ మహానుభావుడికి గుర్తింపులు, గౌరవాలు నచ్చవు. వాటిని ఆశించి చేసిన కార్యం కాదిది. దయచేసి నన్ను అర్థం చేసుకోండి.

ఈ ప్రదర్శనము ఇలా జరుగుతూ ఉందని కూడా ఆ మహాత్మునికి తెలియదు. తన చిత్రాలకు సంబంధించిన స్పృహ కూడా ఆయనకు లేదు. ప్రస్తుతం ఆయనకు కూడా నా లాగే ఎనిమిది పదులు నిండాయి.

కాకపోతే ఒక్క విషయం. రేపే ఈ ప్రదర్శనమును సమాప్తం చేస్తున్నాము కనుక, ఏ ఆడంబరాలు లేకుండా ఆ మహాత్మునికి ఈ చిత్రకళా ప్రదర్శనాన్ని చూపించాలని భావించాను. నాకు మీరందరు ఒక్క సహాయం చెయ్యండి.

రేపు ఆయనను నా వెంట తీసుకొని వస్తాను. ఏ హడావుడి లేకుండా మీరు ఆయనను ప్రశాంతంగా దర్శించండి. విషయం చెప్పకుండా మెల్లగా ఆ మహాత్ముని వేదిక మీదికి తీసుకొని వస్తాను. అందరమూ మనసారా ఆయనను సన్మానించుకొని సంతసిద్దాం' అన్నాడు తాత. అందరూ అంగీకరించారు.

మరునాడు సాయంత్రం ఎలాగో నచ్చ చెప్పి కృష్ణదాసును చిత్ర ప్రదర్శనం వద్దకు తీసుకొని వచ్చారు. కర్ర సహాయంతో మెల్లగా అడుగులు వేసుకుంటూ కృష్ణదాసు తన ఆరాధ్యదైవ మైన శ్రీకృష్ణ భగవానుని వివిధ చిత్ర రూపాలను దర్శించి పులకరించి పరవశించి పోయాడు.

చివరి చిత్రాన్ని చూచిన తరువాత, 'మహాత్మా! మీరు రూపొందించి నాకు ప్రసాదించిన ఈ కళా రూపాలను మీ అనుమతి లేకుండా ఇలా ప్రదర్శించి నందుకు నన్ను క్షమించండి' అని పాదాలపై పడ్డాడు ప్రదర్శనమును ఏర్పాటు చేసిన తాత.

నాయనా! ఎంత శ్రమ పడ్డావు! ఈ చిత్రాలకు చట్రాలు కూడా చేయించావు. నా కన్నయ్యను నాతో పాటు ఇంతమంది దర్శించే అవకాశాన్ని కల్పించావు. కళా హృదయం కన్నా జీవనకళ ఎంత గొప్పదో నిరూపించావు' అని ఐదు పది చేశాడు కృష్ణదాసు.





కళాకారు లందరూ కృష్ణదాసును వైభవంగా సన్మానించే కార్యక్రమానికి ఉద్యుక్తు లయ్యారు. ఇంతలో దివ్యమైన కాంతులను విరజిమ్ముతూ ఒక రథం ఆకాశం నుండి క్రిందికి దిగుతూ ఉంది. రథంలో ఎవ్వరూ కనిపించడం లేదు. ఆశ్చర్యంతో సర్వులూ అవలోకిస్తున్నారు. ఇంతలో దివ్యనాద మొకటి రథం నుండి వినిపించింది.

'దేవతలు కృష్ణదాసు కొరకు ఈ రథాన్ని పంపారు. పరమేశ్వరుని దివ్యసన్నిధిలో కృష్ణదాసుకు ఘన సన్మానం జరుగ బోతోంది. సమయం అట్టే లేదు' అన్న మాటలు వినిపించాయి. కృష్ణదాసుకు సమీపంగా రథం వచ్చి ఆగింది.

కృష్ణదాసు రెండు చేతులు జోడించి అందరికీ నమస్కరిస్తూ రథం ఎక్కాడు. సర్వులూ పలికే విజయ ఘోషలు మిన్ను ముట్టుతూ ఉంటే,

*చరణము:* **కవితల గుండెలో ప్రాణము నీవే**
**మమతల గుడిలో వాణివి నీవే**
**అంతము లేని కాంతివి నీవే**
**అనంతమైన శాంతివి నీవే ॥**
*పల్లవి:* **నీవే - నీవే - నీవే - నీవే - నీవే**
**నా యెద కదిపిన కళ నీవే ॥ నీవే ॥** - అనే చైతన్యగీతిక నేపథ్య గాన రసాన్ని ఆస్వాదిస్తూ, రథం గగన విహారం చేస్తూ అదృశ్యమైంది. పుణ్యఫలాలను దాటి పోయిన భక్త కృష్ణదాసు జన ప్రియ సన్మానాలకు అతీతంగా పయనించి, సురపూజితు డైన తన కన్నయ్య చరణ కమలాలను చేరి తరించి పోయాడు.

నదిని దాటిన వాడు తీరం చేరినట్లు, పుణ్య ఫలాలను దాటిన యోగి ఆదికారణము, సర్వోత్కృష్టము అయిన మోక్ష తీరాన్ని చేరి తరిస్తాడు. ఏనుగు పాదంలో అన్ని పాదాలు ఉన్నట్లు, మోక్షంలో సమస్త ఫలాలు, పుణ్య ఫలాలతో సహ ఒదిగి ఉంటాయి. అట్టి పరమోత్కృష్ట మైన స్థానాన్ని జ్ఞానయోగి పొందుతాడు **(ఇదం సర్వం విదిత్వా యోగీ పరం ప్రకృష్టం, ఐశ్వర్యం స్థానం ఉపైతి ప్రతిపద్యతే).** ఈ అధ్యాయారంభంలో అర్జునుడు అడిగిన ఏడు ప్రశ్నలకు ఇలా వేడుకగా సమాధానాలు అందించ బడ్డాయి.

**ఓం తత్ సత్**

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే అక్షర పరబ్రహ్మయోగో నామ అష్టమోఽధ్యాయః

**ఈ విధంగా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రము, శ్రీకృష్ణార్జున సంవాదము అయిన భగవద్గీత యందు అక్షరపరబ్రహ్మ యోగ మనే ఎనిమిదవ అధ్యాయము.**

